శ్రీరస్తు

# చిత్రరత్నాకరము

శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారిచే

విరచితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము.

 1951 [Price Rs. 1-0-0

# వచన గ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, ఒకేసంపుటము | | 9 | 0 |
| డిటో మూడుసంపుటములు | ... | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము, ఆదిసభాపర్వములు | ... | 5 | 0 |
| ,, ఆరణ్యపర్వము | ... | 5 | 0 |
| ,, విరాటోద్యోగపర్వములు | ... | 5 | 8 |
| ,, భీష్మద్రోణపర్వములు | ... | 7 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు | ... | 5 | 8 |
| ,, శాంతిపర్వము | ... | 7 | 8 |
| ,, ఆనుశాసనికము మొదలు స్వర్గారోహణ పర్వమువఱకు గల సంపుటము | ... | 7 | 8 |
| ఆంధ్రవచనవాల్మీకిరామాయణము, బాలకాండము | | 2 | 8 |
| ,, అయోధ్యాకాండము | ... | 5 | 0 |
| ,, ఆరణ్యకాండము | ... | 2 | 8 |
| తక్కిన కాండలు | (అచ్చగుచున్నది) | | |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 3 | 0 |
| అరేబియన్ నైట్సుకథలు | ... | 2 | 0 |
| యజుర్వేదకథాసంగ్రహము | ... | 0 | 8 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది | ... | 0 | 10 |
| డిటో టీకతో | ... | 1 | 4 |
| భోజకాళిదాసకథలు, I భాగము | ... | 1 | 0 |
| డిటో II భాగము | ... | 1 | 0 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 8 |
| డిటో A. S. P. అయ్యరుగారిది | ... | 0 | 8 |
| ద్వాదశోపనిషత్తులు, తెనుగు వచనము | ... | 5 | 0 |
| రత్నప్రభ, మూడంకముల చరిత్రాత్మక నాటకము | ... | 0 | 8 |
| సీతపెండ్లి, ఇతర నాటకములు | ... | 0 | 12 |

శ్రీ ర స్తు

# చిత్రరత్నాకరము

శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారిచే

విరచితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స

వారిచేఁ బ్రకటితము

శ్రీః

## శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారి జీవితసంగ్రహము

చిత్రరత్నాకర మను నీప్రశస్తవచనగ్రంథమును రచియించిన శ్రీరామమూర్తిపంతులుగారు ప్రథమకవిజీవితచరిత్రకారులుగ నీవఱ కాంధ్రలోకమునకు పరిచితులు. వీరు క్రీ. శ॥ 1851-వ సంవత్సరమున తూర్పుగోదావరీమండలమున పెద్దాపురముగ్రామమున జన్మించిరి. వీరు కౌండిన్యసగోత్రులు, ఆర్వేలనియోగిశాఖాబ్రాహ్మణులు, శ్రీ అయోధ్యరామయ్యగారిమనుమలు, శ్రీపంతయ శ్రీరామలక్ష్మీదంపతులకు తనయులు. వీరియత్తవారు పారుపల్లి వారు. వారు మిగులధనవంతులై దానధర్మములకు ప్రఖ్యాతిఁజెందినవారు. వీరిమామగా రగు శ్రీ పారుపల్లి లక్ష్మీనారాయణగారు పెక్కుమందిబ్రాహ్మణబాలురకు విద్యాభ్యాసాదికము గావించి వారి నొకనింటివారినిఁగఁ జేసిన నెఱదాతలు. శ్రీరామమూర్తిగారుకూడ ధనవంతు లగుటచే మొదటనుండియు దానధర్మములయందు సాహిత్యమునందు నభిరుచి నలవఱచికొనిరి. ఇప్పుడు కీర్తిశేషులును బహుకాల మాంధ్రసాహిత్యపరిషత్తునకు వ్యవహర్తగానున్న వారును అగు శ్రీ కొత్తపల్లి సూర్యరావుగారికి వీరు కావ్యపాఠములుచెప్పి వృద్ధిలోనికి తీసికొనివచ్చిరి. కావుననే వారు 'జానుగ మద్గురు

జాడన్, ధీనిధి శ్రీరామమూర్తి తీర్చెక భళిరా!' అని, తమ గ్రంథములలో చెప్పుకొన్నారు.

శ్రీరామమూర్తిగారు స్వయంకృషిచేత సంస్కృతాంధ్రాంగ్లభాషలు నేర్చిరి. 1871-వ సం॥లో ప్రవేశపరీక్షలో కృతార్థులైరి. గ్రంథరచన కావెనుక నారంభించి తమజీవితాంతము వఱకు సందే గడపిరి. 1872-వ సం॥ లో షేక్స్పియరురచితమైన 'Merchant of Venice' అనునాటకమును 'వణిక్పురవర్తకోదంతము' అనుపేర భాషాంతరీకరించిరి. ఆంగ్లేయభాషనుండి యనువదించిననాటకములలో నిది మొదటిది. 1876-వ సం॥లో కవిజీవితరచనప్రారంభించిరి. 1880-వ సం॥లో నీచిత్రరత్నాకరము రచించిరి. తెనుఁగున కవిజీవితములు వ్రాసినవారిలో తొలివారు వీరే కావున నాకాలమున పత్రికలన్నియు నీయుద్యమమును ప్రశంసించినవి.

శ్రీరామమూర్తిగారు గొప్పచరిత్రకారులు. వీరు 1. రావువంశచరిత్ర, 2. రాయనభాస్కరమంత్రిచరిత్ర, 3. తిమ్మరసు చరిత్ర, 4. అప్పయదీక్షితచరిత్ర, 5. విద్యారణ్యచరిత్ర అను వానిని రచియించిరి. సోమదేవరాజీయమునందు వారివారి వంశావళి మున్నగుచారిత్రకగ్రంథములను ప్రకటించిరి.

1890-వ సం॥ము నుండి "ప్రబంధకల్పవల్లి" అను మాస పత్రికను నడపిరి. ఆవెనుక కాకినాడ నివాసముగ నేర్పఱచుకొని "రాజయోగి" అనుపత్రికను ప్రకటించి అందులో ప్రబోధ

చంద్రోదయము మొదలగు నాంధ్రప్రబంధములను ముద్రించిరి. 1883-వ సంవత్సరమున కాకినాడలో శ్రీబాలాత్రిపురసుందరీ సమేత శ్రీరామలింగేశ్వరస్వామిఆలయమునకు శిలామయ ముఖమంటపకళ్యాణమండపములను గట్టించిరి. వీరు క్రీ. శ॥ 1893-వ సం॥ నుండియు శ్రీవిజయనగరాధీశుఁడును సాహిత్య విద్యాభోజుఁడునునగు శ్రీమదానందగజపతీంద్రుని యాస్థానికులై మిక్కిలి గౌరవముఁబడసి క్రీ. శ॥ 1899 సం. లో కీర్తిశేషులైరి. వీరు కవులచరిత్రయే గాక కవికావ్యప్రశంసాచంద్రిక యను మహాగ్రంథమును శ్రీనిడుదవోలు సుందరంపంతులుగారి సహాయమున రచించిరి. అది అముద్రితముగనే యున్నది.

వీరికవులచరిత్రము నాంధ్రలోకమున కిదివరలో నందించితిని. చిత్రరత్నాకరముకూడ నిప్పుడు ముద్రించితిని. ఈగ్రంథము పలుతడవలు మదరాసువిశ్వవిద్యాలయము వారును ప్రభుత్వమువారును ప్రవేశపరీక్షాదులకు పఠనీయముగ నేర్పఱచుటచేతనే గ్రంథప్రాశస్త్యము తెలియుచున్నది. విద్యాశాఖాధికారు లిట్టి యుత్తమవచనగ్రంథముల నాదరింతురుగాక.

తండయార్పేట
చెన్నపట్నము

వావిళ్ల వేంకటేశ్వరులు
10-5-51

# చిత్రరత్నాకరము

## ప్రథమవీచిక



సిరికిరవై సకలబుధనికరసేవ్యంబై యకుంఠితపరికరరక్షి తంబై మెఱయు వికుంఠసుతపురం బను నొకపట్టణోత్తమంబు గలదు. ఆనగరశ్రేష్ఠంబునకు విష్వక్సేనుం డను సార్వభౌముం డొడయండై యుండు. ఆ రాజేంద్రుండు స్వీయతేజంబు ధర్మంబున దశదిశలం బ్రసరింపఁజేసి ధర్ముం డను లోకవిఖ్యాతి గాంచియుండు. ఆభూపతిసింహునివీట భిక్షుకసఖుం డని యక్షేశు నధిక్షేపించు నొక్కవణిక్శిఖామణి ధనాధిపనాముండు వాసము చేయుచుండు. ఆతండు కంతునిదంతి యనఁదగు నొక సీమంతినీలలామపాణిగ్రహణం బగ్నిసాక్షిగ నొనర్చె. చిర కాలం బాయింతి సంతానేచ్ఛనుండి యొక్కని నతిసుకుమారుఁ గుమారుం గనియె. ఆధనాధిపుఁ డాయర్భకునకు దామోదరుం డను నామం బుంచె. పిమ్మట నాతని సకలశాస్త్రపారంగతుండగు నొకగురువున కొప్పించిన, నాబుడుతఁడు విద్యలన్నిటిం గ్రమం బున శ్రద్ధాళుండై కఱచె. ఇట్లా బాలుండు త్రిదశవత్సరంబుల ప్రాయంబున నుండ వర్తకుండు తనకుమారు తనకు మాఱుగఁ జేసి, తాను కృతాంతనిశాంతంబున నాతిథేయసత్కారంబులఁ బ్రీతిగఁ గొనఁజనె.

యౌవనసుఖంబుల నశ్రాంత మనుభవించి మించెడి తన
తోడిబాలకుల ననేకుల ధననాథులం జూచి యట్లచేయ తానుం
గముకింప, దానఁ దనయయ్య సమ్మతింపక మితంబుగ ననవరతంబు
ధనంబు సెలవుసేయ సెలవొసఁగినఁ దద్భయంబున నట్లే యుండు
వాఁడు గావున దామోదరుండు పితరుని యనంతరంబున నిసు
మంతయుఁ దండ్రింబోలె విత్తసమార్జనేచ్ఛాపరుండు గాక,
విరుద్ధబుద్ధి నాత్మీయపైతృకధనంబు విచ్చలవిడి వెచ్చపెట్ట
నత్యంతము నుత్సహించెను. మఱియు ధనంబునకుఁ దగు
త్యాగంబువలన నిల నత్యంతము కీర్తికాముండ నయ్యెద నని,
యయ్యెడఁ దనయర్థంబున నర్ధంబు త్యాగంబున కుంచి, మిగిలిన
దానివలనఁ బట్టణంబున భర్తృహర్మ్యంబులను జనపదంబుల ఫలా
ధికమాన్యంబులైన మాన్యంబులం గొనె. ఇటులు గ్రాస
వాసంబులకు నిరాయాసరక్షకంబైన తత్స్వాపతేయంబున నొక
రూకయైన ముట్టక కూడఁబెట్టెద నని పెద్దలపాదంబులం గొట్టి
యొట్టుఁ బెట్టుకొనియె. మిగిలిన సగంబును నాతండు రొక్కం
బుగఁ దనదిక్కునం జేర్చి దానిచే మున్ను తన్ను జనకుండు
శిక్షింప నిరర్థకంబులుగఁ గడపినదినంబులకుఁ బశ్చాత్తప్తుండై
యింకనైన దినంబులు సార్థకంబులుగ నొనర్చెద నని యత్నం
బొనరించె. అంత దామోదరుండు తనయీడుకు జోడగుకోడె
కాండ్రనెయ్యంపుసఖత్వంబునకు నియ్యకొనె. దినంబులు ఘనం
బగు నానందంబున జరుప మనంబునఁ బెనంగొను నిచ్ఛగల
జనంబె కద వీరలు! ఇట్టివారి కవ్వారిగ మృదుతరాహారంబులు
ప్రతివాసరం బొసంగుచుండు. అత్తఱి బహుమధురరసాయనం
బవు ద్రాక్షరసాయనంబు రసనానందకరంబై వెల్లుగ వెల్లువయై

ప్రవహిల్లు. తత్సమయంబున గాయకజన గళగళితకలస్వనంబు లును, వైణికాదివీణాముఖవాదంబులును, మేదురంబుగఁ బర్వి సర్వజనమనోనాళీకంబులు నాళీకగర్భనిర్భరానందపాత్రంబు లుగ నొనరింపం దొడంగు. ఇట్టి సంతోషభాక్కులగు జవ్వను లందఱు నొక్కమొగిఁ జక్కని గీతంబుల సంగీతసరణి సంఘంబు లుగఁ బాడుచుందురు. పలుమఱు రాత్రుల నిట్టి మహోత్స వంబులు తత్పట్టణంబున నాటపాటల మేటి నామంబులు వడసిన స్త్రీపురుషజననటనాదిక క్రియాకలాపంబుల విరమించుచుండు. ఇటు లనుదినంబును తనివిసనక పలువిధంబులగు సుఖంబుల నను భవించి మించి మత్తిలి తత్తదర్థంబుగ విత్తంబంతయు స్వచిత్తాను సారియై సెలవుసేయుటంజేసి దామోదరుం డొక్కవత్సరంబు కంటె నధికంబుగ వ్యయభరంబు నోప నసమర్థుండయ్యె. ఆహా! ఆహాయనంబును అయనంబున నధికంబుగ నుండు నాయంబును నాసమయంబున నాస లుడుగ నంతరించె. దాన సమస్తంబును నస్తమించె. చూడుఁడీ! దామోదరుని చేతి ధనంబునకు ఫలంబు. ఈతండు విందులు పెట్టుటుడుగుతోడనే నెఱసఖిత్వంబులును మడియఁదొడంగె. ఈతఁడు దృష్టిగోచరుం డగునేని మిత్రులం దాము నగోచరులగుదురు. ప్రమాదంబుననేని వారిని మార్గ మధ్యంబునం గని, నిలు మని పిలిచిన నిదె వచ్చెదము, క్షమి యింపు డని విడిపడ నుడువుదురు. దామోదరుం డాత్మీయహిత కృతఘ్నతకు మిగుల వగవఁదొడంగె. ఈతఁడు తన ధనంబు దుర్మేధం దుర్వ్యయంబు సేసియు నేస్తంపుకాండ్ర వియో గంబుచే నగు విచారంబునకుం బాత్రుండయ్యె. దుఃఖసాగర నిర్మగ్నుండై సాలోచనుండై దామోదరుండు తల్లియున్న

యిల్లు చేరి యామెకు సమీపంబున నొక్కయెడఁ జతికిలఁబడి యూరకుండె. ఆపె యాతనిముఖంబు వీక్షించి దుఃఖిగా నెంచి, "కొడుకా! నీరాకకుఁ గతం బేమి? అదేమి ముఖవికాసంబు మాసె? శోకింపఁ గారణం బెద్ది? ఇద్దినం బింత ఖేదంబుగ నుండుట కెయ్యదియో హేతువు నుండవలయు. ఈ ప్రపంచంబున నీకుండుసర్వస్వంబు కోలుపోయిన, నీవింతగ వింతగ విచారింప నవసరంబు లేదు. నీవు దుర్వ్యయం బింతకుం జేసియుంట నేను మున్న యెఱుంగుదు. దాన నిక్కంబు నీరొక్కంబంతయుం జక్కంబడియుండనోపు. మనమాన్యంబు ఫలశూన్యంబు కాక యుండ మనకుం గొదు వేమి? దానికి భద్రం బగుఁగాక. నీవెట్టి విరుద్ధవర్తనుండవై యున్న నిన్ను నే నొనాడకుంట నీవు సగంబు పదిలంబు సేయుటం జేసి కాదె? కావున నీవిప్పు డిప్పటు తరదుఃఖాబ్ధిమగ్నుండ వగుటకుఁ గారణంబు నాకుఁ గానరాదు." అని యిట్లు జనయిత్రి పలుక కన్నీరుమున్నీరై పాఱఁగ నేడ్చుచు దామోదరుండు తల్లిం జూచి యిట్లనియె. "హా! అమ్మా! దుర్భరంబగు దారిద్ర్యం బెంతదుఃఖకరంబో దానిని స్వానుభవంబున వివరించెద వినుము. అస్తమిత సూర్యుఁడు కాంతిం బోనడుచునటులు దారిద్ర్యంబు సంతసంబు నపహరించు. లేమిని స్తుతిపాఠంబు లేమిని కానరావు. ఇంత యేల బీదకు నాదరం బేది, చుట్టలు నిష్టులుఁ గులభ్రష్టునిగఁ దలంతురు. ఓజననీ! గతవత్సరంబంతయు హితులకు నే నతి శయంబుగఁ జేయుసన్మానంబు నీమతి నెఱుంగుదువుగద. వర్ణితౌ దార్యంబున మిత్రసూక్తి ధనంజయునకు నాత్మీయధనం బింధ నంబుగ నాచరించితి. ఇపుడు నాచేయుసత్కారంబు లేమిం జేసి

వాసిచెడ నన్నెడఁబాసి మోసగాండ్రు గాసిలఁ జేసిరి. చూచితే స్వీయంబగు స్వాపతేయంబు ముట్టక యుండుసటుల నజేయం బగు మనస్థైర్యం బొసంగు దైవంబు నే నెంతని వినుతింతు. ఇఁక జాగరూకుండనై దీని ననుభవించు తెఱం గెఱింగితి. హితు లనఁదగని యాదుర్మతుల యౌదార్యంబు గతియెట్టిదియో యిపుడు నే నరయ నున్నాఁడ. ఒక్కనొక్కనిగ నందఱం గనుం గొని తత్తదర్థంబులైన తొల్లింటి నాచేత లుగ్గడింక యీ నాదురవస్థఁ దొలఁగఁద్రోయ సంఘీభవింపుఁ డని నుడి వెద. దీనిచే వారలు కృతజ్ఞులగుదురో కృతఘ్నులగుదురో కాననయ్యెడిని.”

అనవిని దామోదరుని మాత యిట్లనియె. “కొడుకా! నీవు చేయ సమకట్టుపని నరికట్టుటకుం గాదు. అయిన భావి కొంతభావించి చెప్పెద వినుము. నీ విట్లాసపడుట కిసుమంతైన యవకాశంబు లేదు. నను నమ్ముము. నీ వేగ నుద్యోగించు ప్రదేశంబుల యత్కించిదర్థలాభంబును గానరాదు. అయిన మన మూరక హితులని పిలుచువార లెట్టివారో స్వానుభవం బున నీమదికిం గోచరం బయ్యెడి. అదియుం గొంత మే లొనఁ గూర్చు. పోయిరమ్ము.” అన విని దామోదరుండు “తల్లీ నీవచ నంబు యథార్థం బనిర్వచనీయంబు. అయిన స్వానుభవజ్ఞానం బునంజేసి మనంబుఁ దనియింపఁ గోరెద.” నా విని దాని కయ్యో మయు నియ్యకొనియె.

పిమ్మట దామోదరుం డతిత్వరితగతి హితదర్శనార్థంబుచని యిండ్లకడనుండు వారలం గాంచి యిట్లనియె. “ఓమిత్రులారా! ఇదే మీదామోదరుండు సర్వార్థసాధనం బగుధనం బంతయుం,

గోలుపోయి యెత్తువడి శుష్కీభూతుఁడై నిద్రాహారంబుల కెడయయ్యె. ధనబలంబుతోన బుద్ధిబలంబును నడఁగె. దీనుం డగు వీనిమానంబు నిలిపి మీరలు సన్మానించుట కిదియె తఱి. వీఁడు మీపాలం బడియె వీని నీరంబుల ముంచిన క్షీరంబుల ముంచిన మీయదియె భారంబు. "మిత్ర మాపది జానీయాత్" అనులోకోక్తి శ్రుతంబు గాదె. మద్వాక్యపరిపాలనంబు నేసి సంచితధనసంచయంబులుంచిన సంచుల మూతియురులు వదలించి వర్షంబుగ ధనంబు గురియించి నాయాపదమాన్పించుట కిదియ సమయంబు." అని యిట్లు బహువిధంబుల దీనాలాపంబులాడి చేయింగాలును గూడఁదీసికొని మీధనం బంతయు నిచ్చెద ననియు నందులకు లిఖితపూర్వకంబు లగుపత్రికల నిడుదు ననియు దామోదరుండు పలికి, 'హితులారా! మీకుఁగ నే నిట్టి కష్టంబులపాలైతిసుఁడీ! తొల్లింటియట్ల విందులకే యిపు డీధనంబు వలయుసుండీ' యనియు భ్రమపెట్టె. ఇట్టి దామోదరునిపలుకులచేఁ దొల్లింటి హితులచిత్తంబులు కరుణాయత్తంబులు గావయ్యె. ఇంతయేల వారిలో ననేకులు నీతోడి సఖ్యంబు మాకు ముఖ్యంబు గాదనియుం బలికిరి.

ఇదియకాదే యూరక యూరందఱు నాకు మిత్రులే యనియుఁ, దదర్థంబు మదర్థంబును వలసిన ప్రాణంబునైన నిచ్చెద ననువాని యనుభవంబు. దామోదరుండు శోకకోపంబులు మనంబునఁ బెనఁగొన వేగంబున నిలుదఱిసి జననిం గని యిట్లనె. "హా! తల్లీ నీవాక్యంబు నిక్కంబు. నేస్తకాండ్ర నేరి నేనిం గానం గాని కృతఘ్నులఁ గృత్రిములఁ బాపుల నాహితు లనఁదగనిపతితులఁ బొడఁగాంచితి. వారు విసర్జనార్హులగుట

నిశ్చయంబ. ఇట్టివారిముఖంబులు వీక్షింపకుండునటు లొట్టు పెట్టుకొంటి." అని తెల్పి తన ప్రతిజ్ఞ భంగంబు గాకుండనుండు నుపాయం బారయం దొడంగె. ఇక నెన్నఁడట్టి దుర్యోగంబు సంప్రాప్తంబు గాకుండుటను గోరి తత్పట్టణజనులయం దేరికి నాతిథ్యం బియ్య నని యియ్యకొని, తనభూధనంబుచే నించిన బొక్కసంబుఁ జక్కఁగఁదీసి, తనకుం దనతోడ భుజించుటకు నొక్కయతిథికిం, దగుమాత్రంబు విత్తంబెత్తి దినంబుల గడపుటకు యత్నించె. ఇంతియకాక తాఁ బిలుచు నతిథి యాపట్టణంబులోనికిఁ దద్వాసరంబున వచ్చెడుపరదేశి కావలయుఁ వాఁ డాదినంబు రాత్రి తోడన పనివినవలె ననియు నిశ్చయించె. ఇట్టియుద్యమంబు నెఱవేర్ప దామోదరుం డనుదినంబును రేపకడ లేచి మాపటివేళకు వలయుసంభారంబుల జాగరూకుండై సమకూర్చి యుంచుచుండు. దినాంతంబునఁ దత్పట్టణంపు వారధి సమీపంబునఁ గూరుచుండి యుండి యెవ్వండేని పరదేశి యక్షిగోచరుం డైనవానికడ కేగి సగౌరవంబుగఁ బిలుచుచు నిట్లను. అయ్యా! మీరలు మార్గాయాసంబున కడు బడలితిరి. మీరీదినంబున మద్గృహంబుననుండి దానిం బావనంబు సేసి నాయొసఁగు నాతిథ్యంబుగొని మఱి సనవలయు. అని తన నియమం బాతనికిం దేటపడ నుడివి పిమ్మట నాతనిఁ దనభవంబునకుం దోడితెచ్చు. దామోదరుఁ డతిథికి మొసంగ నొసంగు పదార్థంబులు వెల నధికంబులు గాకున్నను రుచ్యంబులై మెండై బహుమధురద్రాక్షఫల రసంబులతోఁ గూడియుండు. భుజించిన యనంతరంబు మాటలాడుచు నిశీథముదనుక చిత్రప్రసంగంబులు జరుపుచుండు. లోకంబువారింబలె సంసారగోష్ఠికింగాక

రాచకార్యంబుల నుడుపుటకుం బోక పలుతెఱంగుల నవ్వుటాల మాటలాడుచుండు. ఈతండు సహజంబుగ సంతోషస్వభావుండు కావునఁ బ్రసంగంబునకు వన్నియ తేఁదగు సరసహాస్యోక్తులు చెప్పి యెట్టివాని నేని దుఃఖ నేని తదుపశమనంబు నేసి నవ్వుల నివ్వటిలం జేయుచుండు. మఱునాఁడు వేఁకువ నాయతిథి మరల వచ్చిన వానితో నిట్లను. దేవుండు నీకుఁ జాలమేలు సేయుఁ గాత. నిన్న నిన్న నాతోడం గుడువ రమ్మనుతఱి నావ్రతంబును శ్రుతపడ నుడివితిఁగదా! హోత్యంతరంబున మనము మరల ముఖావలోకనాదికకృత్యంబులు సేయనొల్లము. కావున దీని విజ్ఞాపనం బొనరింపవలసివచ్చె; దీనిచే నను నెగ్గాడంజూడకుము. నాయభీష్టంబు సమకూర్ప నీశ్వరుండు నినుఁ బ్రేరేపించుఁగాత అనుచుండు. దామోదరుం డిట్టి వర్తనంబున జాగరూకుండై యొక్కతఱిఁ బిలిచిన యతిథిం జూచి ప్రమాదంబుననైన భాషింపక, ముఖంబు వీక్షింపక తొలంగుచుండు. ఇట్లుండ బహువత్సరంబులు గడిచె.

అంత నొకనాఁ డినుండు కాలచోదితుండై, భీకరశత్రు రాజకరవిదళిత తీవ్రప్రతాపుండై, ఆశలు దిగనాడి పశ్చాన్ముఖుండై, యంబుధియ శరణంబని చన దామోదరుండు తత్పట్టణపురోభాగంబున నెప్పటియట్ల వ్రతంబుకతంబున వేచియుండెను. అంత విష్వక్సేనసార్వభౌముండు నిగుఱుగప్పిన నిప్పుకభంగిఁ బ్రచ్ఛన్నుండై యాదిక్కునం జనుచుండె. తనపెగ్గడలును దక్కంగల పరివారజనంబులును స్వనియమితకార్యంబుల నేర్పరులై యున్న నీతండు సర్వవృత్తాంతంబులును దనకక్షిగోచరం బగునటు లొనరింప నభిలషించు. కావున పలుమాఱు మాఱు

వేషంబున నాపట్టణంబును దత్పరిసరంబులును వీక్షింప నేతెంచు చుండు. ఆనాఁ డాపట్టణమునకువచ్చు విదేశవర్తకునిమాడ్కి నొకవేషధారి పరిచరుండు తోనడువ నేతెంచె. సార్వ భౌముండు గంభీరాదిగుణంబుల విలక్షణుండుగా నాతని రాజ రాజని యెంచక కొంచెపువర్తకునిఁగ భావించి దామోదరుండు 'స్వామీ నిలుఁడు; దేవరకు వందనంబులు.' అని యిట్లు నమ స్కారంబుసేసి నవ్వుచు నతనిహస్తంబు మెల్లన పుణుకుచు మీ రిటకు నేమంబున విచ్చేయుటంజేసి నే నెంతయు సంతస మందితి. దూరాయాసంబున దేవర కడు బడలియున్నట్లు తోఁచెడిని. నను గారవించి నాగృహంబునకు విచ్చేసి నాయొ సంగు నాతిథ్యముంగొని మీ రీరేయి నిచ్చట నిచ్చలునుండి మఱి చనుండు.' అని తన యాహ్వానంబునకు మాఱువలుక కుండునటుల నాతనితోఁ దొలుతఁ దాను వీక్షించువిదేశిని సన్మానించు తనవ్రతంబును వాక్రుచ్చె. రాజేంద్రుండును దామోదరునివచనంబులు విని వానిలో నెయ్యదియో యొక వింత యుండియుండు; నట్లైన దానిం దెలియకపోరాదు; ఇట్లు వర్తకరూపంబున నుండియే యీవృత్తాంతంబు సమస్తంబు గనుంగొనియెద నని యోచించి యాతని కిట్లను. 'అయ్యా! నే నీయూరుచేర నేతెంచునంతకు నింత సన్మానించువానిం గాంతు నని యెఱుంగ; ఇట్టి సజ్జనులగు మీయభీష్టంబు సమకూర్చుట కంటె నాకు ముఖ్యం బింకొకటి కలదె? మీయిష్టంబె నా యిష్టంబు.' అనుడు దామోదరుం డవకాశాత్సంభవుండగు నీతం డెంత ఘనుండగునో, దానిని యోచింపక తనసమానునిఁగ నెంచి యిలునేరి భోజనశాలకుం గొంపోయె. అందు వీరిరువురు

నుచితాసనంబుల నుండియుండ దామోదరుని తల్లి శాల్యో దనంబును, సూపసహిత బహువిధశాకంబులును, పచ్చళ్ళును, రసోదంచితంబుగఁ జేసి తెచ్చి సమీపంబున నుంచిన వానిలో వలయువానిం గ్రమంబుగ మానముద్రాధారులై వీరిద్దఱు మెసంగుచు నెసంగి యుండిరి. భోజనానంతరంబున రాజ పుంగవు పరిచారకుండు జలంబులు తెచ్చిన నాయిరువురు హస్త ప్రక్షాళనాదిక క్రియ లాచరించిరి. అనంతరము జంబుజంబీర రసాల ఖర్జూర కదళీ పనస దాడిమాది ఫలంబులు నొసంగ నీయిరువురు భుజించిరి. అంత దామోదరుండు తల్లిం జూచి యాపరిచారకునకు బాగుగ నన్నపానాదు లిడు మని తెల్పి యచ్చోటువాసి పానశాలకుం జనియె. అచ్చట ద్రాక్షరసా యనంబును దద్భాజనపుంజంబును బహుళంబులై యుండె.

అచ్చోఁ గూర్చుండి దామోదరుండు కృతకవణిజుదిక్కు మొగంబై యాతండు ఫలంబులఁ గొన గమకించుసమయంబున ద్రాక్షరసాయనంబున నొకచషకంబు నించి తనచే నుంచి సార్వ భౌముం గాంచి యిట్లనియె. 'ఓమిత్త్రుఁడా! నీవును నిట్లొన రింపుము. నీ వీపని నెటులు దలంతువో నామతంబున దీని వలదనువాఁడు బుద్ధిమంతుండు గాఁడు. రమ్ము ముఖమ్ము ముడిచికొని యెల్లపుడు విచారంబె శరణంబుగ నుండువారిం బోల మనకేల? మనము సంతసంబున నుందము. అట్టి సంతోషం బీపాత్రంబు పూర్ణంబై యుండుటంజేసికదా కల్గు' అని దామో దరుం డారసంబు గ్రోలుచుండ సార్వభౌముండు దనకరంబున నొకచషకంబు పట్టి యతనిం జూచి యిట్లను. నిను నేనిచ్చలుఁ నిచ్చయింతు. ఈవు యథార్థవాదివి, నీసరసంపు తలంపునకుఁ

చాల సంతసంబందితి. నాచషకంబును సరసంబుగ నొనరింపుము. నావుడు దామోదరుం డట్లుచేసి 'అయ్యా! దీనిం జవిగొనుము. స్వాదు వని వాదించి చెప్పెద.' అనవుడు నానరపతిపుంగవుండు నవ్వుచు నిట్లను. 'నీవు మంచివాని నేర్పరించి కైకొనెడితెఱంగు బాగుగ నెఱుంగుదువని నేఁగరంబు తెలిసికొంటి'నని యాతండు రసం బానుచుండ దామోదరుం డిట్లను. 'ఆహా! ప్రపంచ జ్ఞానము గల యెల్లవారికిఁ దమకు లాభకరంబగు వస్తువు మంచిది యని యనాయాసంబుగ బోధయగు దానిం గొనియాడ నేల! నేఁడు నాకెట్టిసంతసంబు నీసంగతి యొసంగె. ఈనిసి నీయట్టి హాసన్ముఖుండగు నతిథిపాత్రునం గుడుచుటం జేసి చిత్తంబున నెట్టి యానందంబు హత్తుకొనియున్నది!' అనుడు సహజంబుగ నానందస్వభావుం డగు నాభూపశేఖరుండు దామోదరుని చిత్ర వాక్కులకు నత్యంతము ముదితుండై నాతని మత్తిలం జేసి పిమ్మట తనమనంబు మఱియుఁ దనియించెదం గాక యని యాతనికి నధికంబుగ ద్రాక్షరసం బిచ్చి త్రావుము త్రావు మని పలుమఱు సముత్సాహిం గావించె. దామోదరుండు నట్లే చేయుచు వచ్చె. అనంతరము వర్తకశిఖామణి యాతనితోఁ బ్రసంగించుట కాత్మఁ దలంచి వానియూరును బేరును బేహారంబును నడిగె, దానికి దామోదరుం డిట్లనియె.

అయ్యా! నాపేరు దామోదరుండు. మాతండ్రి యీవీట నుండు నొకగొప్పవర్తకుండు. అతండు కొంతకాలంబు క్రిందట కాలవశుండయ్యె. ఆయన లోకాంతరగమనుం డగునపుడు నాకు స్వేచ్ఛగ జీవనంబు సేయుటకు వలయునంత ధనం బిడి మఱచనేఁ గాని, యాతని జీవితకాలంబున నను సతంబు మితవ్యయునిఁగం

జేయుటం జేసి యాతండు గతించినపిదప మున్ను వ్యర్థంబుగఁ గడ
పితినని యెంచిన కాలంబు కూడఁదీయ గమకించితిఁ గాని ముందుగ
భవిష్యత్తుం గూర్చిన యోచనారహితులై భోగేచ్ఛాపరులై
తుది లేవడిసంద్రంబున మునింగి దానిదరిఁ జేర నేరమిం జేసి పరిత
పించు బాలురకంటె నే నొకకొంతబుద్ధిమంతుండను కావున
నాకును లేమిడివలని విపత్తు తటస్థించు నేమో యని తలంచి, నాధ
నంబులోన సగంబు చేకొని, యొకస్థాపతేయముం గొని దాని
యాయంబు ముట్టునని యాసమయంబున సమయంబు గావించితి.
మిగిలినయర్థంబు మదర్థంబు వ్యయపఱుప రొక్కంబుగ నొక్కెడ
నుంచుకొంటి. అనంతరము నాయీడు కోడెకాండ్ర సఖిత్వంబు
వేఁడి తద్విషయంబుగ నాసొమ్ము దినమ్ము వమ్ముసేయఁ దుద
కొక్కకాసైనఁ గాన్పింపదయ్యె. కావున ముందువలె వారలకు
విందులు గానరావయ్యె. వర్షాంతంబున ఘనులభంగిఁ దద్వ
ర్షాంతంబున నాఘనులును నదృశ్యు లయిరి. పిమ్మట వారలఁ
గనుంగొని నాయవస్థ వారల కెఱింగించితి. వారలలో నొక్కఁ
డైన నాదిక్కున దయాళుండు గాఁడయ్యె. అనంతర మిట్టివారల
తోడిసఖ్యంబు ముఖ్యంబుగా దని తెలిసికొని వారల విసర్జించి
నావచ్చుబడిలోన జీవనంబు జరుపుటకు నీపట్టణంబులోని కాది
నంబె యేతెంచువై దేశికునికి నొక్కనికిందప్ప నితరుల కెప్పుడును
నాతిథ్యం బియ్య ననియు, వాఁడును నానక్తంబుతోన సంత్య
క్తుండు కావలె ననియుం దలంచితి. ఈదినం బట్టి రసికాగ్రేస
రుండగు నతిథితోడిసాంగత్యంబు పొసంగ నొసంగు దైవం
బును నే నెంతని వినుతింతు!' అని తన వృత్తాంతంబంతయు నట్లా
తండు తెల్పిన మేదినీకాంతుం డెంతయు స్వాంతరంగంబున సంత

సంబంధి దామోదరుం జూచి యిట్లనియె; 'ఓయీ! నీవు మరల బుద్ధిమంతుఁడవై యట్టి దుర్వ్యసనంబునుండి మరలుట యత్యాశ్చర్యంబు నతిశ్లాఘనీయంబు నగు. ఇట్టి నడతలు బుధులలం దుండుట కడు నరిది. నీవిట్టి సహేతుకయుక్తిపరుండ వగుటకు నే నెంతయుఁగొనియాడెద. నీవీవర కవలంబించిన త్రోవయపాయ రహితంబు గాదు. ఇటుల నీవిత్తంబు మొత్తంబు చిత్తాను సారంబుగ సెలవుసేసి తుదకు నీస్వాపతేయంబు విక్రయంబు గాకుండ జాగరూకుండ వైవందులకు మిగుల నబ్బురం బబ్బెడిని. అనంతర మీవీరీతిని నుండుట మఱియు వెఱఁగుఁ బుట్టించు చున్నది. ఇంత యేల, నీసౌఖ్యంబు నాకుం గాంక్షితంబు; వాసర మాసర మారమావల్లభులం బోలె నీవును నీయతిథియుఁ గలసి మెలసి కర్ణభూషణంబులగు భాషణంబుల నుల్లసిల్లుచుండు నదృష్టంబు నీకుంగాక నీలోకంబున నింక నేరికిం జేకుఱు. అట్టి యతిథి త్వత్కృతసత్కారంబుఁ బెల్లుగ నెల్లయెడల వడినుడువ కుండునే! పానీయంబు మాని బహుతరంబుగఁ బ్రసంగించితిమి. రమ్ము పానమ్మునకుఁ బాత్రంబు నిండనిమ్ము.'

అని యిట్లు వర్తకచక్రవర్తు లిరువురు నన్యోన్యసరసాలాపంబుల రసపానంబుల సంతసంబున నిశీథముదనుక నుండునపుడు పృథ్వీపతిపుంగవుండు మార్గాయాసంబుననుంటింగాన విశ్రమింపఁ గోరెద నని యొకనెపంబు వన్ని యిట్లనియె: అయ్యా నీనిదుర చెడకుండవలెం గాన నే నిప్పుడ పనివినియెద. ఏమి యన, వఱువాత నీవు మేల్కాంచునంతకు నేను మానగరంబున కేగుదు. నీసదయాంతరంగంబు నౌదార్యంబును నీయొసంగు నాతిథేయ సత్కారంబులతెఱంగును నామనంబున నాటియున్న వనుమాట

నీవు నెఱుంగం గోరెద. నీ ఋణం బెటులు దీర్చెద ననుతలం పొక్కటియె నామనంబు సంచలింపం జేయుచున్నయది. నాచే నగు కార్యమెద్దియైన నున్నం దెలుపుము. పిమ్మట ననుం గృతజ్ఞునింగ భావించెదుగాక. యథార్థంబుగ నీ కొఱకుచేనగు నర్థం బెద్దియైన నుండియుండు. లేక నీకొఱ కేదియైనం నొకకొఱంతయు నుండు. నాకడ నీవు దాంపవలదు. నేవర్తకమాత్రుండ ననకుము. నీయభీష్టంబు స్వీయంబుగనైనం బరకీయంబుగనైన నెఱవేఱుపంగలనని తలంచెద.' అనుడు దామోదరుం డాతని సదయోక్తులు విని, యానేల నేలుదంట వర్తకుడే యని భావించి యిట్లనియె. 'అయ్యా! మీరీపలుకులు యథార్థంబుగ్గం బ్రసన్నహృదయులై పల్కుచున్నారని నే నెఱుంగుదు. మీరలు సమర్థులు నగుదురు. తొల్లి నే వాక్రుచ్చుభాతి నాకత్యాశ లేదు. ఈశ్వరుం డిచ్చిన దానిచే మిక్కిలి సంతుష్టిపొంది యున్నాను. నాయింటంగల కలియో గంజియో నాతోపాటుగం గైకొని సంతసింపంజేసి తిరి. అదియ నాకుంబదివేలు. ఇందులకుమీకు వందనశతంబులు. స్వల్పంబైన దా సుకృతి సుకృతి కృతిగాం దలంచును. కావున నన్నింతగ దేవర కొనియాడు చున్నారు. అది యటుండ నిండు. నే నీతఱిధనార్థంబు గోరునది గోరంతైన లేదు. అయిన మనశ్శల్యంబై యున్న దాని నొకదానిమాత్రము వివరించెద. ఈవి కుంతసుతపురంబు పలుదెఱంగులైన రాజమార్గంబులుగను, గ్రంతలుగను విభక్తంబై యున్నట్లును వీథివీథికి దేవళంబులున్నట్లును, వానిలో విధ్యుక్తంబుగ నర్చాదులజరుప నర్చకులున్నట్లును, మీ రెఱుంగుదురుగద. మావీథిదేవాలయంబునకుం గరాళవక్త్రుండును, మాయావియు, నతిదుర్మార్గుండు నగునొక

ముదుసలి వైఘూససుం డున్నవాఁడు; అతఁడును జుట్టుపట్లనున్న యట్టివాండ్రు నలువురు నొకస్థలంబునం జేరి యచ్చటఁ దాము ముచ్చటించుచో నన్నును నాపొరుగువారి ననేకులను పేరుపేరువరుసం దిట్టుచు విచ్చలవిడిఁ బెచ్చుపెరిఁగియున్నారు. తా మెల్లరం దిట్టుటమాత్ర మెఱుఁగుదురుగాని తమవర్తనం బెట్టిదియో తా మెఱుఁగరు. తమబ్రతుకు తెరు వెఱుఁగని వీర లితరులకు బుద్ధులు గఱపెదరు.' అను దామోదరుపలుకులు విని కుంభినీధవుఁ 'డోయీ యింకెద్దియైన వాక్రుచ్చెదవే' యనుడు, 'నింతియ కాదు' తెల్పెద వినుండు. అని యిట్లనియె. "నే నొక్క దినంబున దిక్కులనేలు చక్రవర్తిం'గావలయు. అను నాతనిపలుకులు విని 'యేమిసేయుదు వనుడు' రాజున కాతం డిట్లనియె. 'సుజనలోకంబు సంతసిలునటుల నీముదుసలి కుజనుల నల్వర నొక్కొక్కని శతసంఖ్యాతకశాఘాతంబులను బరులనిందకు నితరుల నెన్నండును సముత్సాహులం జేయకుండ నుండుటకు నా పెదముదుసలివాని నిర్ఘాతపాతంబులంబోని చతుశ్శతమిత కశాఘాతంబులను నొప్పించెద.'

అనుడు నాభూజాని దామోదరుపల్కులకు ముదితుండై వింతలఁ జూడఁగోరు స్వాంతంబుగలవాఁడు గాన వానికోర్కి నెఱవేర్పుతలంపున నిట్లనియె. 'దామోదరా! నీయభిప్రాయంబు నాకును సమ్మతంబే; దుర్మార్గులు శిక్షితులు గాకుంట న్యాయవిరుద్ధంబని నీ వూహించుటచే దీనిం దెల్పితివి. నీకోర్కి సఫలంబు గాఁ జూచుతలంపును నాకుఁ గల్గెడిని. దీని నీవంత యసాధ్యం బని యూహింపవలదు. నీసుస్వభావంబును న్యాయబుద్ధియు నెఱిఁగిన తోడనే సార్వభౌముండు నీయెడం గరుణించి తనసర్వాధికా

రం బొకదిన మంతయు మనఃపూర్తిగ నీకొసంగు; సంశయము పనిలేదు.' అనుడు దామోదరుం డాతనిం జూచి నీవు నాగొం తెముకోర్కులకు నగుదువు కాంబోలు. ఇంతియ కాక జనపతియు దీని విన్న నవ్వును. అయిన దీనిచే నాముదుసలుల చారిత్రంబు ప్రభునకు గోచరంబవు. అయైన వారికి ముప్పు తప్పదు.' అనుడు సార్వభౌముండు 'దామోదరా! 'ఇంటఁగుడిచి యింటివాస ములు లెక్కించె'నన్నట్లు నీయింట సుఖంబుగ భుజించి నినుఁ జూచి యేనవ్వుదునే? దైవము తోడు. రాజును నీవృత్తంబు విని సంతసిలు, సందియము లేదు. ఇప్పటికి మనమాటలు కట్టి పెట్టుదము. నిశీథసమయమయ్యెఁ గావునఁ బండియుండ యత్నిం తము.' అనుడు దామోదరుం 'డయ్యయ్యో మీరు నిద్రింతు మన్న మీనిద్రకు భంగంబుసేయుదునా? పానక మింక నున్న యది వలయునేని మరలఁ బుచ్చికొనుదము. ఇంకొకటి మనవి చేసెద సూర్యోదయంబునఁ దారు ముందుగ నిద్ర లేచితిరేనిఁ జనుచో వీథితలుపుమాత్రము మూసి మఱచనుఁడు.' అనుడు నాతండు దానికి సమ్మతించె. అంత నాసార్వభౌముండు మాటల సందడి నాతఁ డుండ రెండుగిన్నెలంగొని రసాయనంబున నా రెం టిని నించి దామోదరున కీయఁదలంచిన దానిలో మత్తుమందుంచి యాతనిం జూచి 'యోమిత్త్రుఁడా! దీని నానుము నిద్రింతము.' అనుడు దామోదరుం డావర్తకునియెడం దనకుండు ప్రేమా తిశయంబు సూపుటకు నాగిన్నెఁడు రసంబును బూర్ణముగఁ ద్రావె, త్రావి గిన్నె క్రింద నుంచుట తడవుగ నామందును దల కెక్కసాగె. అంత నతని కొకకొండంత నిద్ర వచ్చె. దానిచే నాతని తల మోకాలిపై వ్రేలఁ దొడఁగె.

అంత నారాజేంద్రుండు తనతో నరుదెంచి యచ్చట భుజించి విశ్రమించియున్న సేవకుం గాంచి దామోదరు నాతని మూఁపున నిడికొని తనవెంబడి నరుదెమ్మని యాజ్ఞయొసంగి యాయిలు గుర్తెఱుఁగవలెననియుం దెల్పె. అంత దామోదరు నెత్తికెచ్చుభటుం డటు లెస్స యని తో నడువ విష్వక్సేనుం డాయిలు వెడలి తలుపుమూయ మఱచి చనియె. ఇట్లు చనిచని యూడిగంపుజనులచేఁ రక్షింపఁబడు నిజమందిరంబు పాణిద్వారం బునం బ్రవేశించి దామోదరు శుభ్రవస్త్రధారిం గావింపుఁ డని తెల్పి యనంతర మాతని స్వీయంబగు హంసతూలికాతల్పంబున నుంప సేవకులకుఁ జెప్పిన వారు నట్ల కావించిరి.

అనంతరము విష్వక్సేనుండు నిజరాజమందిరపాలకులను దాసీదాసాదులం బిలిపించి 'యెల్లి మీరెల్లరు నస్మదీయతల్పశాయిరైన యీతనికి నా కెట్టిగౌరవంబు నడుపుదు రట్టిగౌరవంబు సూపి కొల్చియుండి యాతని యాజ్ఞకు లోను గావలయు. అతనియభిమతంబు సార్వభౌమునిదియ కావునఁ జేయక యుండవలదు. ఇంత చెప్పనేల, అతం డెల్లి సార్వభౌముండు. కావున సర్వజనులు భయభక్తుల నాతనిఁ గొలిచి యుండి కార్యము లాతని చిత్తానుసారంబుగ నడపుఁడు.' అనుడు నాయుద్యోగియులును యువతీజనంబులును బ్రభుండు లీలార్థంబు దానిం జేయుటగా నెఱింగి యంగీకారసూచకముగ దలఁలూఁచి పనివిని మఱునాటికార్యం బూహించుచు నచ్చోటు వెడలి చనిరి.

అనంతర మాధరణిధవుండు నిజామాత్యపుంగవుండగు సుధీరంజను రావించి యిట్లనియె. 'ఓయీ సుధీరంజనా! నీ కొక

మాట దెల్పెద. ఈ నామంచంబునఁ బండియున్న మనుజుండు రేపటిదినంబు మదీయ విభవోపేతుండై మత్సింహాసనాసీనుండై యుండం గని యెవ్వం డని నీవు శంకింప వలదు. నావలె వీఁడు నెల్లి పూజ్యుండు. నీవు సగౌరవంబుగ నెదురుగఁ జని తోడ్తెచ్చి యథార్హంబులైన పూజలు గావించి సింహాసనాధిష్ఠితుం జేయుము. అతఁ డేమియాజ్ఞాపించిన నది యెల్లి చెల్లవలెను. మనధనమంతయు వెచ్చపెట్టి నాజ్ఞయొసంగిన నాయాజ్ఞ మదీయంబుగ భావించి తత్క్షణంబ యాతనియిష్టంబు నడుపుము. ఇంకొకటి వినుము. మనసామంతమంత్రిజనులకు సభాభవనంబున నీతని విశేషసన్మానంబుసేయ నాజ్ఞ నొసంగుము. ఇంత చెప్ప నేల. ఇది చమత్కారార్థంబుగ జరుగుచున్న దని యాతనికి సిసుమంతయుఁ దెలియవలదు.' అనుడు వల్లె యని సుధీరంజనుండు పని వినియె. నరేంద్రుండును వృత్తాంతమంతయు విన(?)గన నిచ్చగ లాఁడు గాన, పుష్పదంతుం డను భృత్యాగ్రగణ్యుం బిలిచి వేకువ దామోదరు లేపుటకు ముందుగఁ దన్ను మేల్కొల్పు మని తా నింకొక భవనంబునకుం జని నిద్రించె.

పుష్పదంతుండు వేకువఁ బరాకులేక ప్రభు నాజ్ఞాను సారంబుగఁ గార్యంబు జరిగించె. అనంతర మారాజోత్తముండు నిద్రమేల్కాంచి దామోదరుం డుండు భవనంబునకుం జని వర్తమానవృత్తాంత మారయ ననువగు నొకచిన్నగదిలోఁ బ్రచ్ఛన్నుండై యుండి చూచుచుండె. దామోదరదర్శనార్థంబు వచ్చినయోషిజ్జనంబును బరిచారకులును దమతమతారతమ్యంబుల కనువగుతావుల నిశ్శబ్దంబుగ సార్వభౌముం డుండుతెఱే నుండున ట్లుండిరి. సూర్యోదయావసరం బగుడు దామోదరుని

తలదరి నిలిచియున్న దాసుం డొక్కరుండు దామోదరుఁ గాల్య కరణీయంబులు నిర్వర్తింపు మని లేపుట కిదియ సమయం బని యొకసస్యఁబు దెచ్చి యాతని మూర్ధానం జేసిన నతండు గల ద్రిప్పి సింహగర్జనముంబోని యొకతుమ్ముఁ దుమ్మె. దానిచే నందఱు నౌషధబలం బడఁగె నని యోచించిరి. తోన దామో దరుండు గన్నులువిచ్చి నలుగెలంకులఁబరికించి యపుడున్న కను వెలుంగునఁ దా నొక విస్తీర్ణంబై వైభవోపేతంబైన దివ్యభవ నంబున నున్నట్లు తెలిసికొనియె. విచిత్రచిత్రంబైన దానిలోని కప్పును, మృదుతరరత్నకంబళములచే నలంకరింపఁబడిన యడుగు భాగంబును గాన్పించె. ఇంతియ కాక వినయవినమితగాత్రలై వీణాది వాద్యవిశేషంబులఁబూనిన యనేక సుందరయువతీజనంబు లును, రత్నాభరణభూషితులగు పరిచారకులు నాతనిఁ బరి వేష్టించియుండిరి. మంచంబంతయుఁ బరికించు చో నాతనికి దాని మణిమయ స్తంభంబులు, దారకాగణశోభితనభంబునుంబోలె ముక్తామణి సముదయవిలసితంబైన పర్యంకోర్ధ్వభాగంబును, గారుత్మతరత్నకల్పితశుకంబునుంబోలెఁ దానును, దూర్వాంకు రచ్ఛాయోపేతగరుత్తులు నరుణముఖంబును గలదై మించు రాజఖట్వాంబును, నికుంజోపరి పరివర్తితపుష్పఫలసమన్వితలై లతానుకారిరైనజాలమును, రతనంబులు ముత్తియంబులు గూర్చి యంచులుదీర్చిన యపరంజివలువచేఁ గప్పంబడియుండు హంసతూలికాతల్పంబును, మృగమద ఘనసారపూగీజాజీఫల యుతతాంబూలకరండవాహినియును,సమీపంబుననుండు సార్వ భౌమకిరీటాంగదగ్రైవేయ భూషణాంబరంబులును జూపట్టె. ఇట్టివిచిత్రవస్తుసమితిం జూచి దామోదరుం డత్యాశ్చర్యసాగర

నిమగ్నుండై యుండి యదియంతయుఁ గలలోఁ గాంచినయర్థం బుగ భావించియు నేసార్వభౌముండనై తి ననిరెయించి, యింకొక నిముసంబునకు నదియంతయుఁ గల యని నిశ్చయించి తనలో నిట్లనియె. మనసెఱుఁగనికల యుండదనుమాట యిటఁ దార్కాణంబయ్యె. నే నిందాఁక వ ర్తకున కెఱిఁగించిన వృత్తాంతంబు మీఁదనే మనసుంచుటంజేసి నా కిట్టి స్వప్నంబయ్యె. అని తల ద్రిప్పి మరల నిద్రింపఁ గమకించె.

అంతం బుష్పదంతుండు వినయపూర్వకంబుగ నిట్లనియె. ఓమహారాజేంద్ర ! అహర్ముఖోచితకృత్యంబులు నిర్వ ర్తించుట కిదియె సమయంబు. ఉదయకాలంబు జరుగుచున్నయది. అను పలుకులకు దామోదరుం డత్యాశ్చర్యంబునంది తనలోఁదా నిట్లనియె. ఏమిది? యిపుడు నేను మేల్కనియుంటినా లేక, నిద్రించుచుంటినా? అని తన్నుందాఁ జూచికొని నిద్రించుచుంటి ననుటకు సందియంబు లే దని కన్నులు మూయుసమయంబునఁ బుష్పదంతుండు మేల్కాన నిష్టంబులేని దామోదరున కిట్ల నియె. ఓభూపతిపుంగవా నే నిపు డుదయమయ్యెనని మరలఁ దెల్పుటచే దేవరచి త్తంబున నాపై నాగ్రహంబుఁ బూనవలదు. ఏలిక యెన్నండు నిట్టికాలంబున వేదచోదితకృత్యంబులు నిర్వ ర్తింపఁ బ్రాలుమాలియుండరు. అనుడు నాతని పల్కులు విని దామోదరుం 'డయ్యయో నే భ్రమసితి ఇది జాగ్రత్తుగాని సుషు ప్తిగాదు. ఏమనిన నిద్రించువాఁడు విన నెపుడును సమ ర్థుండుగాఁడు. నే నిపుడు స్పష్టంబుగ వీని వినుచున్నాఁడను.' అని కన్నులువిచ్చి కనువెలుంగున సంశయంబుగఁ దా మున్ను వీక్షించిన పదార్థమంతయు మరల విస్పష్టంబుగఁ జూచి వికసిత

ముఖపంకజుండై లేచి, పాన్పుపయిం గూర్చుండి యుండె. అపుడు దామోదరుం డట్టి యవశాత్సంభవంబగు మార్పునకు నానందాబ్ధిమగ్నుండై యున్నట్లు గాన్పించె. ఇట్టివిశేషములు సార్వభౌమునకు విశేష ముదావహంబు లయ్యె.

అంత నారాజమందిరంబులోని వారవధూటు లందఱు నాతని పదములకు దండ ప్రణామంబు లాచరించిరి. వీణాదిసాధనంబులం బూనిన లతాంగులందఱును దమతమ శ్రుతులం గలిపి మృదుగీతంబుల మంగళగీతంబులును మేలుకొల్పులును బాడిరి. ఆగానంబు వీనులం బడినతోడనే పరవశుండై దామోదరుండు తానెవ్వండో యెచ్చోనుండెనో, యేర్పరింపనుగూడ సమర్థుండు గాఁడయ్యె. అనంతరము కొంతవడికిఁ దొల్లిటి తన యభిప్రాయంబు మరలఁ జింతించుచుఁ డాఁ జూచునదియంతయు స్వప్నంబులోనిదిగాఁ దలంచి దామోదరుండు తనయిరుగేల నేత్రయుగ్మంబు మూసికొని శిరంబువంచి తనలోఁ దా నిట్లు చింతించె. అయ్యయో, యిదియంతయు నేటివృత్తాంతంబు? నే నిపు డెచ్చోనున్నాఁడ? ఈదివ్యభవనం బెవారిది? ఈపరిచారకు లెవ్వరివారు? ఈజవ్వను లెందుండివచ్చిరి? వారకామినులిటరాఁ బనియేమి? ఇపుడు నామనంబు స్వప్నంబుననుంటంజేసి భ్రమసి యున్నదో, లేక యథాస్థితి నున్నయదియో తెలియు టెట్లు గలుగు? అని కన్నులు విచ్చి చూడ నచటి గవాక్షములపై సూర్యకిరణప్రసారంబు గానవయ్యె. అపుడు పుష్పదంతుండు మఱల సాగిలంబడి యిట్లనియె. ఓభూధవేంద్ర దేవరతో సంధ్యాదికవైదిక క్రియలు నిర్వర్తించు ముఖ్యకాలం బతిక్రమించినదనియు మున్నెన్నఁ డింతతడవు నిద్రించియుండరనియు,

విజ్ఞాపన సేయుచున్నాను. క్షమియింపఁగోరెదను. ఇంతియ కాక రాత్రి యెదియేని దుస్స్వప్నంబున నేలిక మనసంతయుఁ జెడి యున్నట్లు గాన్పించు. ఈదినంబున సభాభవనంబునకు విచ్చేసి యెప్పటియట్ల సింహాసనాసీనులగుటకు నేలికకు నోపిక లేక యున్న ట్లూహించెదను. దర్శనార్థంబు సేనాధిపులును సకల దేశాధీశ్వరులును దక్కంగలసభాసదులును సభాభవనంబున వేచియున్నారు. అని యిట్లు పుష్పదంతుం డాడినమాటలచే దామోదరుండు తా మేల్కనియున్నట్లును, దాఁ జూచునది స్వప్నజన్యంబు గానట్లును దెలిసికొనెఁగాని, దేనిచే నదిగల్గెనో దానినిమాత్రము నిరూపింప లేఁడయ్యె. తుదకుఁ బుష్పదంతుం దప్పక చూచి మెల్లన నతఁ డిట్లనియె. ఓయీ! నీవెవ్వనితో మాటలాడుచున్నాఁడవు. వీరిని సార్వభౌముం డని పలుమఱుఁ బిలుచుచున్నావు. నాకుం జూడ నీ వెవ్వండవో తెలియరాకున్న యది. నీకు భ్రమచేత న న్నింకొకనిఁగ భావించినట్లు తోఁచెడిని. అనునిట్టి దామోదరు పలుకులకు విష్వక్సేనునివలన బోధితుండై నిర్భయుండై యున్నపుష్పదంతుండుదక్క నోరు లెత్తి దిట్టలైనఁ దత్తఱపడక యుత్తరమీయ లేకుండు రనుటకు సందియంబు లేదు. అనంతరము పుష్పదంతుండు దామోదరుం జూచి, మహాజగతీధరేంద్రా! యిట్లు నన్నడుగుట దేవర నామనంబుకొలఁది యారయంగాదె? ఏలిక రాజరాజబిరుదాంకమును వహించి జగంబేలు విష్వక్సేనసార్వభౌములరు. సన్నిధానంబునఁ జిరకాలంబుండియు సేవావిశేషంబువలనఁ దనియని యీతమదాసుండగు పుష్పదంతుండు తన ప్రభు నీవఱకు మఱచి యుండ లేదు. ఇంక ముం దేమిగా నున్నదో? దేవరసంపూర్ణాను

గ్రహంబునకు వీఁడు పాత్రుండుగాకున్న వీని కీజగంబున సంతోషకారి యొకటి గలదా? కావున నీ దీనుని ప్రార్థన లంగీకరించి యభయదానం బొసంగి రక్షింపందగు. దేవర హృత్కుశేశయంబు దుస్స్వప్నంబున శతధా దళితంబయ్యెననఁ జిత్తంబునఁ గినుక వొడముసేమొ యని మాత్రము భయము పుట్టుచున్నయది.

అనుడు దామోదరుండు పుష్పదంతునిపల్కులకుఁ గడు పుబ్బ నవ్వి నవ్వునకు నోపలేక వెనుకకుఁ జేరగిలంబడియె. ఇట్టి దామోదరునిసంతసంబు విష్వక్సేనునకుఁ బ్రహాసనంబు గల్పించె. తననవ్వు పైకి గ్రక్కనంబడిన నావృత్తాంతం బంతయు నంతంబందునని యెంచుటచే నతండు తనన వ్వాఁచికొనెఁగాని లేకున్న దామోదరునింబలె దానును గడుపుబ్బ నవ్విపోను.

దామోదరుండు నవ్వ లేక వేసటఁ మరల నాపాన్పునం గూర్చుండి సామీప్యంబున నున్న యొక నల్లనికుఱ్ఱపరిచారకుం గని దగ్గఱ రాఁబిలిచి యోవత్సా! నే నెవ్వండనో తెల్పు మనుఁడు నాబుడుతఁడు వినయవినమిత గాత్రుఁడై దేవర లోకాధీశ్వరులగు విష్వక్సేనచక్రవర్తులరు. అనుడు వానిం జూచి యవురా నల్లనివాని నమ్మఁగూడ దను సుమతివాక్యంబు యథార్థమౌనట్లుగ నబద్ధ మాడితివి. అని వానిం బొమ్మనితనకు మిక్కిలి సమీపంబుననున్న యొక్కముదవతిం జూచి తనచేసాఁచి, యోకుందరదనా! మెల్లన నాయంగుష్ఠంబుచివర దంతక్షతంబు సేయుము. అట్లైన నేనిద్రఁ జెందియున్నాఁడనో లేక మేల్కాని యున్నాఁడనో నాకు గోచరంబగు. అనుడు నమ్మత్తకాశిని రహంబుననుండిచూచు విష్వక్సేన సార్వభౌమునకుఁ దనప్రౌఢత,

నంబుసూపి సంతసిలం జేయుతఱి యదియని యాననాంబుజంబున వికాసాంకూరంబుల నణఁచి వినయగంభీరంబు లేపాఱఁ జని యాతనిహస్తంబు మెల్లనఁ దనయిరుగేలంబట్టి మునిఖంట నాతని వ్రేలందికొని వృశ్చికంబు వీఁటునట్లుగ దంతక్షతంబు సేసె. దాన నాతండు కేవునఁ గేకవేసి తనచేయూడఁబెఱికికొని 'యిపుడు నే మేల్కనియున్నా ననుట కొకసందియంబును లేదు. ఎట్టిమహత్త్వంబుననో నే నొకనాటిరాత్రిలో నిట్టి సార్వభౌముండ నైతి. ఇది జగంబునఁ గ్రొత్తదియు నానందదాయియు నగు చిత్రంబు.' అని నిశ్చయించుకొని యాయింతిని మఱలఁ జేరం బిలిచి, 'యోసిలతకూనా! నేనిజముగ సార్వభౌముండ నే యగుదునా? దీనిలోని యథార్థంబు దేవునియానగ నెఱిఁగింపుము. అనుడు నావ్రాఁబోఁడి యోరాజేంద్ర! దేవర సార్వభౌములని తమవిభవంబె బోధించుచున్నయది. ఇందుకు తమకు సందియం బేల జనియించె నని మాత్రము శంకవొడమెడి. అనుడు, హా! నీవెంతసొగసగు మోసకత్తెవే! నన్ను నే మఱచితి ననుకొంటివి కాఁబోలు. నే నెవ్వండనో నేబాగుగ నెఱుఁగుదు.

అని యనంతరము దామోదరుండు లేవ నుద్యుక్తుండగుడు దానింగని పెట్టి పుష్పదంతుండు చేయందిచ్చి క్రిందికి దించె. దామోదరుండు కాలుక్రింద నుంచుట తడవుగ వంది మాగధస్తుతిపాఠంబులును వీణాదివాదనకలస్వనఁబులును నింగి ముట్ట నొక్కపెట్టున మ్రోసె. అంత జయజయశబ్దంబు లిచ్చుచు సార్వభౌమేంద్ర బహుపరాకు; బహుపరా కని పల్కువంది మాగధులంజూచి, దామోదరుం'డహాహా! దైవంబింతయొప్పునే! దైవకృతమున కిల నసాధ్యములు గలవే, యను నార్యోక్తి

యుంచట నిజమాయె. నిద్రించుచునుక నే దామోదరుండ. ఇపుడు చూడ నే సకలదేశములనేలు సార్వభౌముండ. ఇట్టిభేదంబునకుఁ గారణంబు భగవల్లీలావిలాసముతప్ప నింకొకటిగల దన నెట్లొప్పు? అని తనలోఁదాను సంతసిలుచున్న సమయంబునఁ గొందఱు పరిచారకులు శుభ్రవస్త్రంబులు గట్టనిచ్చిరి. మఱికొందఱు తిలకంబుదిద్ది హారంబులు మెడనిడి కిరీటాంగదాదిభూషణంబులు ధరింప నిచ్చిరి. అంత నొక్కదాసుండు పాదంబులకుఁ బైడిపావలమర్చి పయనంబునకు సమయం బన, నిర్వురు లతాంగు లిరుపక్కియలనిలిచి కైదండయొసంగ ముందఱఁ బుష్పదంతుండు నడువ, దామోదరసార్వభౌముండు విద్యుల్లతాశోభితజలధరంబుభంగి సుందరమందయానం బేపారం గదలిన, యోషిజ్జనంబులు గొందఱు చామరంబులు వీచుచు ఛత్త్రంబు పట్టుచు నృత్తగీతంబులు సలుపుచు వినోదంబులు గావించుచుఁ దోడ నడచిరి. ఇట్లు వెడలి యంతఃపురంబులును భర్మహర్మ్యంబులును గడచి దామోదరుండు సభాభవనంబు సమీపంబునకు వచ్చి నిలిచినఁ బరిచారకులందఱు నెచ్చటనున్నవా రచ్చటనే నిలిచి యుండిరి.అంత నాయువతీజనంబును బుష్పదంతుండును ముందుగ నడిచి సింహాసనంబుఁదఱిసి యందు దామోదరప్రభునిఁ గూర్చుండఁబెట్టి దండప్రణామంబు లాచరించి తమతమనివాసంబులకుం జనిరి. విష్వక్సేనుండు నంతకుమున్న యచటికే తెంచి యొకచిన్నగదిలో నొదిఁగి నిజసింహాసనాధిష్ఠితుండగు దామోదరుండు చేయువ్యాపారంబులఁ జూచుటకు నాతని పల్కులాలించుటకు వేచియుండె.

దామోదరసింహాసనారోహణానంతరము మంత్రిపుంగ వుండగు సుధీరంజనుండు సనుదెంచి వినయవిద్యావివేకంబులు ప్రకాశింప నెదుట నిలిచి జైవారంబుచేసిన, దామోదరుండు ప్రాతఃకాలవృత్తాంతంబు సుధీరంజనునివచనంబులును దలపోసి తనకోర్కి సఫలంబయ్యె నని తలంచి, సార్వభౌముండ నైతి నని యెంచి సంతసించియుండె. కావునఁ దనయదృష్టమునకుఁ గారణం బూహింపక తత్క్షణంబ విశేషగాంభీర్యంబున నామంత్రివర్యుం జూచి నీవేమి మనవి చేసికొనెదనుడు నాతం డిట్లనియె. ఓపృథ్వీ తలనాథా! దేవర యాస్థానంబులోని సామంతమంత్రివరులును, దేశాధిపతులును, దక్కుంగలసేనానులును, దర్శనార్థంబువచ్చి సింహద్వారసమీపంబున దేవరయాజ్ఞకై వేచియున్నారు. సెల వేనిఁ బిలువ నంపెద. అనుడు దామోదరుం డాక్షణంబ సింహ ద్వారంబుతలుపులు దీయ దౌవారికునకుఁ దెల్పుమనిన నామంత్రి వర్యుండు వారలు రాఁ జేవిసరె. అప్పు డాయుద్యోగియు లందఱుఁ జనుదెంచి సింహాసనము శిరంబులఁ దగులునట్లుగ భూమికెరఁగి దండప్రణామంబు లాచరించి సార్వభౌమేంద్ర! ఖమ్మపరాకని పల్కి సుధీరంజను నాజ్ఞానుసారులై యథోచిత స్థానంబుల బంతులుదీరి కూర్చుండియుండిరి.

ఇట్టి యుత్సవంబైనయనంతరము సుధీరంజనుండు కొన్ని కాకితంబులు చేనిడికొని సింహాసనమున కభిముఖుండై నిలిచి విశేషోపయోగంబులుకాని రాచకార్యంబులు ప్రభునకు విజ్ఞాప నంబు సేయుచుండె. అపుడు దామోదరుండు శంకాతంకం బులు లేక సింహాసనంబుననుండి చేనికిఁ దగుదాని దానికి నన్ని విషయంబుల నుత్తరం బొసంగుచుండె. ఈతనిబుద్ధివిశేషంబు

నకు విష్వక్సేనుం డాశ్చర్యంబుగఁ జూచుచుండె. మంత్రి శిఖామణి యాతనియుదంతంబు సాంతంబు సేయకమున్నె, దామోదరుండు దండనాధికారిదిక్కు మొగంబై ప్రధానింజూచి మాకుం దండనాధికారితోఁ బనిగలదు. అనుడు నాదండ నాథుం డవ్వార్త విని లేచి యెదురుగఁ జనుదెంచి సాష్టాంగ నమస్కారంబు గావించి బహుపరాకని చేతులుకట్టుకొని నిలిచి యుండ నాతనిం గని యిట్లనిగెు. ఓయి దండనాయకా! యీపురంబులోని యేనవవీధి కిఁక జని యచ్చటనున్న ముదుసలి నంబిని కడమచిన్న దేవళంబులనర్చించువారల నల్వురనుం బట్టు కొని యం దొక్కొక్కని శతపరిమితకశాఘాతంబులను పెద్దను చతుశ్శతకశాఘాతంబులం గొట్టింపుము. అనంతర మావంచక పంచకంబు నైదురాసభంబులపై నెక్కించి విరూపులంజేసి పట్ట ణంబు నలుగెలంకులఁ ద్రిప్పుచుఁ దమకార్యంబులయం దాస క్తులుగాక పరుల నిందించి, కుటుంబకలహంబులఁ బుట్టించి, జనుల మనంబులు కళవళంపడఁజేయువారి కీప్రాయశ్చిత్తంబు లిట్టివే యని సాటింపఁ బంపుము. ఇంతియకాక నేఁడు మొదలు ద్రోహు లావీథిం బాదం బెన్నం డుంచకుండ నాజ్ఞ యొసంగుము. నీ భృత్యులు కార్యంబు నడుపుచుండ నీవు వైళంబ మాకడ కేతెంచి మాయాజ్ఞ చెల్లుటఁ దెల్పుము. అనుడు నాదండ నాయకుండు దేవరచిత్త మని మరల నమస్కరించి పనివినియె. సార్వభౌముం డిట్టి దామోదరుజాగరూకత కెంతయు నలరి యుండె.

సుధీరంజనుండును మరలఁ దనయుదంతంబు విజ్ఞాపనం బొనరించుచు ముగింప నుండు నవసరంబున దండనాథుండుం

గార్యంబు నెఱవేర్చివచ్చి స్వామీ! దేవరచిత్తానుసారముగఁ గార్యంబు నడిపి నమ్మకమున లోకశాకితం బావీథిగృహస్థుల చేవ్రాళ్ళుగలదానిఁ దెచ్చితి నని చేతికిచ్చిన దానిం గైకొని దామోదరుండు వ్రాలుచేసినవారిపేరులు చదివి, వారలు తా నెఱిఁగినవారగుటవలన దండనాథుకార్యంబునకు సంతసించి లెస్సచేసితివి నీస్థానంబునం గూర్చుండు మని యాజ్ఞ యొసంగి తాఁ గృతార్థంమన్యమానుండై తనలో నిట్లు చింతించె. ఆబుద్ధిహీనులగు వృద్ధులు నాయతిథిపూజ నెంతయు నిందింత్రు. అట్టివారు దండనకే తగియున్నారు. ప్రభునకు దుష్టశిక్షణ శిష్టరక్షణమ్ములేకదా శ్రేయోదాయకంబులు. అని సంతసిలు తఱి నితనియభిప్రాయ మారయు విష్వక్సేనున కీతనివర్తనంబు మిగుల సంతోషకారి యయ్యె.

అనంతరము దామోదరుండు సుధీరంజనుం బిలిచి యిట్లనియె. సుధీరంజనా! రాచబచ్చుకడ కేఁగి మాయాజ్ఞఁదెలిపి లక్షవరాలు సంచినుంచి తెప్పించి దాని నీవఱకు దండనాథుం డరిగియున్నట్టి వీథినున్నయొకానొక దామోదరునితల్లి యగు శోణదంత యను సుప్రసిద్ధనామంబు వడసియున్న ముసలిదాని కిచ్చి నీ విట నున్నట్లు రావలయు. అనుడు నామంత్రివల్లభుండు నయవినయసంభ్రమంబులు ముప్పిరిగొనఁ బనివిని, రాచ బచ్చుం గాంచి ధనంబు గొని దానిం దెమ్మని తనభటులకు నాజ్ఞ యొసంగి తా నాశోణదంతయింటిలుసేరి 'యోముదుసలితల్లీ! యీ ధనంబు నీకు బహుమానార్థంబుగ సార్వభౌముం డిచ్చె' నని తెల్పి తా మరలివచ్చె. అపు డాయమ సార్వభౌముని నిర్హే తుకకటాక్షంబున కెంతెం తనరాని యానందంబు నందియుండె.

సుధీరంజనుండు మరలి వచ్చుదనుక దండనాథుం డిటుఁ గార్యంబు నివేదించుచుండె. అంత నామంత్రిసింహుండు వచ్చి దేవర యానతిచ్చినవిధంబునఁ గార్యం బంతయు నడపితి ననియె. తోడన పుష్పదంతుండు సభాసదులతోఁ గొలువు చాలింపఁ బ్రభునియిష్టం బగుడు వారందఱుఁ దోఁటియట్ల దండప్రణామంబు లాచరించి నివినిరి.

అంత దామోదరుండు సింహాసనంబు డిగ్గి తోంటియట్ల జవ్వనులిరువురు కైదండలిచ్చి నిలువ పుష్పదంతుండు త్రోవ దీయ మహానసంబునకు మందగమనం బేపారఁ గదలె. కొందఱు పరిచారకులు ప్రభురాక వందిమాగధుల కెఱిఁగించిన వారు కైవారంబులు సేయుచు జయజయశబ్దంబు లెసంగ స్తుతిపాఠంబులు చదివిరి. మఱికొందఱు వారవధూటులు వీణాదివాద్యంబుల శ్రుతిచేసి కంఠంబులం గలిపి రాగంబు లాలాపించుచు మూర్ఛనలు ప్రకాశింపంజేయుచు రక్తివోడమునట్లు చేసినఁ, బులకాంకితగాత్రుండై దామోదరుండు మైమఱచి కొంతతడవుండి తాఁ జూచుదాని వినుదాని నేర్పరింప లేకుండి యనంతర మిట్లు చింతించె. ఇది కల యయ్యెనేని మిక్కిలి పెద్దది కావలయును - నిక్కము కలగాదు - అట్లైననేవినుటయుఁ గనుటయుఁ జనుటయు నొరుల ననుటయు నెట్లుగల్గుఁ? ఎట్టిది యెట్లయ్యెనో నాకుఁ దెలియదు. భగవన్మాయ యేమిటిదియో, నేను సార్వభౌముండను గాక తదితరుండ నని నమ్మంజాలను. కాకున్న నిట్టి విభవంబుననుండు నదృష్టంబింకొకని కేలకల్గు? నాయెడ వీరికిం గల్గు గౌరవాతిశయంబులును, నాయాజ్ఞాబద్ధులై నానుడి నడుపుతఱి నుండు వీరి వినయవర్తనంబులును నానిశ్చయంబునకు

నిదర్శనంబులుగ నున్నవి. అని కృతనిశ్చయుండై యుండెఁ. ఇంత చెప్పనేల దామోదరుం డెద్దియో యొకవిశేషమాహాత్మ్యంబునఁ దా సార్వభౌముండ నైతి నని దృఢనిశ్చయమున నుండె. అనంతర మాతండు మహానసవిభవంబు చూచిన తోడన తొంటియభిప్రాయంబు స్థిరమయ్యె. అచ్చో దేవతార్చనావితర్దిసమీపంబున ననేకదీపారాధనంబులు వెలుఁగుచుండె. ఋత్విజులు నీరాజనమంత్రపుష్పంబు లిచ్చుచుండిరి. అంతఁ బరిచారకు లీదామోదరుని స్నానంబునకుఁ దోడ్కొనిచని యొక యున్నతాసనంబుపైఁ గూర్చుండఁబెట్టి, కొందఱు కిరీటాదిభూషణంబు లూడ్చిరి. మఱికొందఱు సంపంగితైలంబునఁ దలయంటి పన్నీట జలకమాడించి తలయార్చి ముడివేసిరి. ఇంకొకకొందఱు చలువమడుంగులు గట్టనిచ్చి, కమ్మకస్తురితిలకంబు దిద్ది, మేన గందమలంది, ఒకమణిమయపీఠంబునకుం గొంపోయి యచ్చోఁ గూర్చుండఁబెట్టిరి. అంత హరిభక్తులు వరుసలుదీరి కూర్చుండి తంబుఱలు సుతిగూర్చి భక్తిరస మొలుకనట్లుగ హరిస్మరణంబు సేయుచుండిరి. ఎదురుగ స్వర్ణపాత్రంబులఁ బంచభక్ష్యంబులును, చోష్యలేహ్యపానీయాదులును, శాల్యోదనంబును సమర్పియుండె. దివ్యాభరణభూషితలైన శృంగారవతు లేడ్గురు దామోదరుండు భుజియించుతఱి విసరుటకై హస్తంబులఁ జందనసుందరవ్యజనంబులును, కమలకోరకకోమలంబులైన వింజామరంబులును బూనియుండిరి.

దామోదరుండు భోజనార్థంబు గూర్చుండి తద్భవనవిచిత్రవస్తుసముదయంబునకు మిగుల నద్భుతమంది యిటునటు చూచుచు ముందువెనుకలఁ బరికించుచుఁ గ్రిందమీఁదులఁ

బరీక్షించుచుఁ దాఁగూర్చుండు మణిమయపీఠంబుసొంపును దేహంబునఁ దా ధరించియున్న యాభరణంబులసొంపును జుట్టునున్న పసిండిగిండులతీరును బలుమఱుం జూచుచుండ, మాఱు వేషంబున నీతని వెనువెంబడిఁ దిరుగుచున్న విష్వక్సేనున కీతని వ్యాపారంబులు నయనోత్సవం బాపాదించుచుండె. అంతం గొంతవడికి దామోదరుండు భోజనేచ్ఛచే నివేదనంబు గావించిన నదియ సమయంబని యాసుందరులందఱుఁ జుట్టునిలిచి కంకణ క్వాణనంబు లెసంగఁ జేతులెత్తి వీవం దొడంగిరి. దామోదరుండు తలయెత్తి వారియొయ్యారంబంతయుం జూచి యాననాంబు జంబున మందహాసంబు కందళింప నిట్లనియె. ఓకోకస్తనులారా! మీరాయం దొక్కొకగరితయే మాదేహంబు చల్ల నేయంజాలు. కావున నొక్కొర్తువిసరుచుండఁగఁ గడమయార్వురు మాబంతిం గూర్చుండి భుజియింపుఁడు. అనివారలలో మువ్వురం గుడి పక్కియం గూర్చుండఁబెట్టి, కడమమువ్వుర నెడమ చక్కి నిల్పె. దామోదరున కెటుచూచిన నాగృహంబున రమణీయ పదార్థంబులే కానుపింపఁదొడంగె. అంత దామోదరుండు భుజియింప దొరఁ కొని యాపూఁబోఁడులు మర్యాదకుఁగా భుజించుట మానుట చూచి యాతండు వారలభయంబు దీర్చి తనపొత్తున మెసఁగున ట్లాజ్ఞ యొసంగె. ఇట్లుండి దామోదరుండు వారలం జూచి మీనామంబు లేమని యడిగిన వారుఁ గ్రమంబుగఁ గంబు కంఠియు, విద్రుమోష్ఠియు, చంద్రముఖియు, అరుణకిరణయు, మనోహరణియు, మీనాక్షియు నని తెల్పి వీవనవిసరుదాని పే రిక్షుఖండం బనిరి. అపుడు దాని కాతండు నవ్వుచు మొఱయు టయు, కాఠిన్యంబును, నైల్యంబును, తీక్ష్ణతయు, చౌర్యంబును,

చాంచల్యంబును మధ్యమరసాస్పదత్వంబును మీయెడఁగలుగ కున్న మీరు మీనామంబులకంటెను శ్లాఘనీయులగుదురు. అను దామోదరు సరసవాక్యంబులు విష్వక్సేనున కతిముదావహంబు లయ్యె.

దామోదరుండును యథేష్టంబుగ భుజించి యుత్తరాపోశనంబుపట్టె. తోడనే యాగుబ్బెత లటదూరంబుననున్న పరిచారకులం జూచి హస్తప్రక్షాళనోదకపాత్రలఁ దెం డనుడు, వారు నట్లకావింప వాని నాసుందరు లందికొనిరి. అపు డొక కుంభస్తని పసిండిగిండిం బట్టి యుదకం బీయ, నింకొకచక్రజఘన బంగారుపళ్ళెరంబు పట్టె. మఱియొక మోహనాంగి దువ్వలువ చేఁబూని తడియొత్తె. ఇంకొకలతాంగి రెండుపాళ్లు కస్తురియు నొకపాలు పచ్చకప్పురంబు నుంచిన విడెంబు వడిగ నందిచ్చె. అనంతరము తొంటియట్ల మందయాన లిర్వురు దామోదరు లేవనెత్తిన, సార్వభౌముండు ఫలాహారార్థంబు విచ్చేయనున్నాఁడు, గానఁ బరిచారకులందఱు ముందుగఁ జనుండని పుష్పదంతుండు తెల్పి తాఁ బురోభాగంబున నడిచిన, దామోదరప్రభుండు రెండవభవనంబునకుం జని, దానివైశాల్యంబును, వైభవంబును, వ్రేలుచిత్తరువులును, క్రాలుస్వర్ణకలశంబులును, పొడకట్టు హాంబట్టుజిలుఁగువలువలును, చూపట్టు మణిమయోపకరణంబులును వీక్షించి, వెఱఁగందియుండె. అచటను దొంటియట్ల మఱికొందఱు గాయకులు తత్కాలంబున కనుగుణంబులైన రాగంబు లాలాపించుచు గీతంబులు పాడుచుండిరి. అట నొకయున్నతాసనంబును, దత్సమీపంబున నొక్కవెండిపళ్ళెరంబునం దనేకస్వర్ణమయపాత్రంబుల లడ్డుకములు మొదలగుబహువిధ

భక్ష్యంబులును, క్షీరాన్నంబును, కదళీపనసద్రాక్షాదిఫలంబులు నమర్చియుండె. తొంటికంటెను రూపవిభ్రమంబులచే నొప్పు యువతీసప్తకంబు వీవనలు పూని పీఠంబుదరి నిలిచియుండిరి.

ఎటుచూచిన నవీనపదార్థంబులే కానుపించుటంజేసి దామోదరుమనంబు విశేషంబుగ నుప్పొంగం దొడంగె. కొంతసే పాకచో నిలిచి నలుగెలంకుల వింతగఁ బరికించి పీఠంబు దరిఁజేరి కూర్చుండి యాజవ్వనులసొబగు నత్యాశ్చర్యంబున ననిమిషలోచనుండై చూచిచూచి, వారిలో నతిసుందరుల నేర్పరింపలేక యూరకుండె. మఱికొంతతడవునకు మరల వారిం జూచి యోపూఁబోఁణులారా! మీరు శ్రమపడఁ జూడ నామన నొప్పకున్నది. కావునఁ నాతోడఁ గూర్చుండుఁడు అని వారిం గూర్చుండఁబెట్టి వారినామంబు లడిగిన వారును దొంటికంటె విచిత్రములై తమసౌందర్యముఁ దేటపఱుచు నామంబులఁ జెప్పిరి. దాని కాతండు లెస్స యని వారిలో మనశ్శృంఖల యనుదానిం జూచి యొకకదళీఫలంబు చేఁబూని నర్మగర్భంబుగ 'నోసి ననఁబోఁడి! యీయనంటి నంటి మామనంబును బంధించిన నీసంకెల లింక వదలింపుము.' అని దాని కాఫలం బొసంగి కడమ వారితోఁగూడ రసోదంచితంబులగు పల్కులు పల్కి రహస్యం బుగ నుండి తన్నుం జూచుచున్న సార్వభౌమునకుఁ గడుసంత సంబు గల్పించె.

ఇట్లు దామోదరుండు లోనికిఁ జని తడవుండి, సౌధాంత రంబులు నంతిపురంబులు దాఁటుచు నచ్చో నుండుమోహానాం గుల వలలం జిక్కియుక్కుదక్కి యుండ, మిత్రుండు బయల నుండి చనిచని పశ్చిమ దిశాసౌధంబునేరి, తామసీసంగమభయం

బునఁ దేజోహీనుండై నిలిచి యుండె. కువలయమిత్రుండని ప్రఖ్యాతిని వహించు నాకు జగంబుపగ లుడిపికొను టెంతపని యనునట్లు రేవెలుంగు లే వెలుంగునఁ దోఁతెంచె. విష్ణుపదంబున నఖంబులై తారుండఁ దమలేమి సూచింప దాని నభంబనియొడు ద్విజాలపై నలిగి తమవిభుండగు నిందున కవ్వార్త దెలుప నొకరి వెనుక నొకరుగఁ జనుదెంచి, యాతండు ద్విజరాజవుట జ్ఞప్తికి వచ్చిన భయంబున వెలవెలఁబాఱి దూరదూరంబుగ నిలిచెననఁ జంద్రోదయావసరంబునఁ దారకలు మందతేజంబుతోఁ గన్పట్టె. అపుడు దామోదరుండు కరదీపికా సహస్రంబులు వెలుఁగఁ బుష్పదంతుండు ముందునడువ నింకొకభవనంబునకు విచ్చేసె. ఆవిశాలభవనంబులోని స్ఫటికంపుగోడలును, వైడూర్యకవాటంబులును, పుష్యరాగద్వారబంధంబులును, నీలపుంగవాక్షములును, వజ్రస్తంభంబులును, సువర్ణవలభియు, ముత్తియంపు ముగ్గులును, గంబూరంపుదీపములును, పచ్చలతోరణంబులును జూచి దేదీప్యమానంబై యున్న దానివిభవంబునే తెప్పలిడక తప్పక చూచుచుండుటచే నాతని కనిమిషత్వం బచ్చుటనే సిద్ధించినట్లు గాన్పించె. అందు సుందరీబృందంబును వైణికసముదయంబు నుండిరి. కొందఱు కురంగాక్షులు హస్తంబుల శర్కరోపేతంబగు గోక్షీరం బుంచిన రజతపాత్రంబులును బంగారుగిన్నియలుం బట్టికొని నిలిచియుండిరి.

దామోదరుం డచటి మణిమయపీఠంబునకు సూటిగఁ జని యందుఁగూర్చుండి యచ్చోటనుండు జంగమవల్లుల యంగలతలంజూచి, వీరు పంచసాయకుండు జగంబు జయించుటకు వదలు మోహనాస్త్రంబులో, లేక ప్రపంచంబున సంచరించు భోజుఁగుల

కన్నులు మిఱుమిట్లుగొనఁజేసి మించు క్రొమ్మించులో యని చింతించుచు, వారలనామంబు లడిగిన నచ్చో నగు భేరీమృదంగాదిధ్వనులచే నాపల్కులు వారికి వినరావయ్యె. అపుడు తన చే వీచి వారి నూరకుండ సైఁగసేసి మిక్కిలి సామీప్యంబున నున్న యొక్క సుందరాంగిపాణిపల్లవంబు స్వీయహస్తపల్లవంబునం బట్టి తొడపయిం గూర్చుండఁబెట్టుకొని చెక్కిలినొక్కి శిరంబు మూర్కొని నీనామం బేమి యని యడిగిన నాసీమంతినీలలామ 'సార్వభౌమేంద్ర! నాపేరు ముక్తామణి యందురు.' అనుడు దామోదరుండు 'బళిరే! నీపే రింతయొప్పునే! నీలావణ్యాతిశయం బింకొకనామంబున ననిర్వచనీయంబుగదె. ఇంతియ కాక నీపేరు నీదంతకాంతిచేతనే యూహింపఁ దగియున్నది.' అని మరల దానిం జూచి 'యోముక్తామణీ! నీకరకిసలయంబున మెఱయుచున్న యపరంజిగిన్నెలో క్షీరంబుంచి యటు లందిమ్ము క్రోలెద.' అనుడు నామిటారి యొయ్యారంబుతోరంబుగా లేచి ముక్తామణిమయహారంబులు వ్రేల గిన్నెలోఁ బాలుంచి వినయవినమితగాత్రయై యాతని కందిచ్చిన, నాతండు మందహాసంబుతో ముందఱి కొఱగి దాని నందుకొని కటాక్షవీక్షణంబుల దాని నీక్షించుచుఁ బాలం గ్రోలి యాబాలం జూచి నీవును గొన్నిటి నానుమని యాజ్ఞయొసంగె. అపుడు వల్లెయని యాలలనామణి గిన్నెం బాలుంచి యొకరాగం బాలాపించి రాలుఁగరఁగునట్లుగఁ బాడిన, దామోదరుండు హా యని మైమఱచి కొంత వడికిఁ దెలిసి దాని నెంతయు నుతించె. అనంతర మాయింతి పాలం గ్రోలె.

పిమ్మట నీతం డింకొకకమ్మనివిలుకాని ముద్దుగుమ్మం బోని దానిం బిలిచి కూర్చుండఁబెట్టుకొని దానినామం బడిగిన నాయింతి తనపేరు వేఁగుఁజుక్క యనితెల్పె. అపుడు దామోదరుం డామాటవిని 'యహాహా, నీప్రేక్షణంబులసోయగ కీనామం బెంతయుఁ దగియున్నయది. నీనేత్రంబుల చకచక తారకతారకంబు గాదె. నీవు నొకగిన్నెఁడుపాలందిమ్మనుఁడు, నాయువిదయు సంతోషకారిణియై యాతనియాజ్ఞానుసారంబుగఁ గార్యంబు నడిపె. ఇట్లాయువిదలందఱుఁ గ్రమంబునవచ్చి తమ తమనామంబులు దెల్పిన దామోదరుండు తగుసరససల్లాపంబు లాడుచునుండి చాటున నున్న విష్వక్సేనున కమితానందంబు గల్పించె.

ఇట్లు దామోదరున కందఱుఁ గ్రమంబున క్షీరంబు లొసఁగి నిలిచియున్నసమయంబున ముక్తామణి మరలఁ దనచేతిగిన్నె నందుకొని యందుఁబాలుంచి విష్వక్సేనుండు తొల్లి తెచ్చిన మత్తుమం దందుఁగలిపి దామోదరుంజూచి యిట్లనియె. 'ఓసార్వభౌమేంద్ర! వీనిం గ్రోలినం గాని, దేవరకు నాయెడంగలదయ తెల్లంబు గాదు. ఈవఱకు దేవర క్రోలినయట్టివి యివి'గావు. అనినతోడన మనం బానందసాగరంబున మునుంగ, "నేఁడు భవదీయమహిమాతిశయంబులఁ గీర్తింపనొకగీతం బేఁగల్పించితి. తొలుత నాగీతంబు విని యనంతర మీపాలఁ గ్రోలఁదగు." అనుడు దామోదరుం డాగిన్నె నందుకొని'యోయింతి! నీవ్విపుడు గీతంబుపై మనసుంచి వింటు. వినుగఁ గైకొందు. పాడుటకు నాజ్ఞయొసంగితి. నీయట్టి ప్రసవకోమలిచేఁ గల్పింపంబడిన గీతం బెట్టి రససమంచితమో విన మనసయ్యెడిని. ఏదీ చూతము.

నీగీతము సంగీతసంగతిఁ బ్రకాశింపఁజేయుము. అనవుడు నాపూఁ
బోఁడి వీణియ నందుకొని శ్రుతిసేసి కంఠంబు దానితోఁగలియఁ
నంగుళులు మెట్లపై మేళంబుగాఁ, గంకణక్వణనంబు తాళం
బుగా, ననురాగంబు పుట్ట రాగంబుఁ బాడుచు గీతంబువాయిం
చిన నచటి ప్రాఁకులు చిగిర్చె. చతుశ్శ్రవస్సులు శ్రవణకుతూ
హలంబున నందంబులై ముందువెనుకలు దెలియక చిక్కులఁ
బడుచు నొక్కచో నిలిచె. సభికులందఱు మూర్ఛఁగొంది రక్తిని
మునింగి తలలెత్తఁ జాలరైరి. దామోదరుండును వివశుండై
తెలిసి, హా! అని మరలఁ దనివినొందక దానినే యనుమాఱు
ముమ్మాఱు పాడించి వినుచు సంతోషాబ్ధి నోలలాడుచుండి
యాతీరంబు లానెను.

అనంతరము దామోదరుఁ డాగీతచమత్కృతి ప్రశం
సించునిష్టంబున ముక్తామణిదిక్కు మొగంబై యుండి "అత్యు
చ్ఛ్రియః పతనహేతుః" అనుమాట యథార్థముసేయునట్లు
ముందరికిఁ బోరగిలంబడి తొల్లింటి యట్ల నోరుదెఱచి కన్నులు
మూసి పడియుండె. విష్వక్సేనుఁ డిట్టిచిత్రంబులకుఁ దొంటి
కంటె నధికానందంబు నొంది, యావఱకు మాఱువేషంబున
సాక్షీభూతుండై యుండి యపు డాభవనంబులోనికిం జను
దెంచి దామోదరునకుఁ దొంటివస్త్రంబులు గట్టించి ము న్నాతని
నెత్తితెచ్చిన పరిచారకునకు నాతనిం దోడ్కొని చని యతని
యింట నొకమంచంబుపైఁ బవ్వళించియుండునట్లు పెట్టి తలుపు
మూయకయ రమ్మని యాజ్ఞ యొసంగె. వాఁడును శీఘ్రంబుగ
దాని నంతయుఁ జేసివచ్చి విష్వక్సేనునకుఁ దనరాకఁ దెలిపె.
అపు డాతండు తనలోఁ దా నిట్లనియె. దామోదరుండు తన

విరోధి నిరోధింప నొకదినంబు తా సార్వభౌముండుగా వేఁడె, అట్టి యాతనియభిమతం బొనఁగూర్చితి, దీనివలన నాతండు సంతుష్టుండై యుండు నని తలంచెద, అని సంతసంబున నుండె. ఇటు దామోదరుండు మఱునాఁడు తడవునిద్రించి యౌషధబలం బడఁగినతోడనె నిద్ర లేచి కన్నులువిచ్చి నలుగెలంకులఁ బరికించి తానెప్పటియింట నుంటఁ గాంచి యత్యాశ్చర్యంబునంది "యో ముక్తామణీ! ప్రవాలోష్ఠీ! చంద్రముఖీ! యెచ్చో నున్నారు; తడవాయె రండు రండు. మదాజ్ఞానుసారులైన మీరి క్షేమతతి యుండిన మాచిత్తం బాగ్రహాయత్తం బగుసుండీ" అనుచు నెగ్గెత్తియఱచిన నాకేక లింకొకగదిం బవ్వళించియున్న దామోదరుని జనని విని త్రుళ్లిపడి లేచి కొడుకుకడకుం జనుదెంచి 'యోరీ కొడుకా యఱచెదేమి? కళవళపడుటకుం గారణం బేమి?' అనుచు సమీపించిన, దామోదరుం డాపల్కులు విని తలయెత్తి తల్లిం దప్పక చూచి 'యేమి? కొడుకా యనెదు, వేరిని ముసలీ?' యనుడు నాపె యిట్లనియె. నిన్నే పిలుచుచున్నాను. నీవే నాపుత్త్రుండగు దామోదరుండవు. నిన్ను నీవు మఱచినట్లున్నావు బాగుబాగు. అనుడు దామోదరుండు సక్రోధుండై మాపరువునకు నీవు తల్లివే. నీబోఁటిబీదలు మాకుఁ దల్లులెట్లగుదురు? మతిచెడినమాట లాడెదేమి? నేను దామోదరుండఁగాను విష్వక్సేనసార్వభౌముండను. ఈనాపల్కులు లెస్సగఁ దెలిసి యుండుము. అనుడు దామోదరుపల్కులు విని యాతనిమాత యిట్లనియె. చాలుఁజాలు నింతటితో నీప్రసంగము చాలింపుము. ఇట్టూరక మొఱిగిన నిన్నొరులు బుద్ధిహీనుం డందురు. అనుడు నామాటలకు దామోదరుండు కనలి

తల్లిం జూచి నీవు బుద్ధిలేని వయోవృద్ధవు. మేము భగవదంశ సంభూతులమైన విష్వక్సేనసార్వభౌములము. ఇంకొకపర్యాయం బీవార్త నీకెఱింగించితిమి. అనుడు నాయింతి యొంతయుం గుంది, కొడుకా! నీపల్కులంబట్టి యోచింప నీకు మతిభ్రమణంబు గల్గినట్లు తోఁచెడిని. కాదేని దయ్యం బేదైనఁ బట్టి నిన్నిట్లు వాఁగించుచున్నదేమో! దేవుం డనుగ్రహించి నిన్నిట్టిబాధల నుండి తొలఁగింపఁ గోరుదు. నీవు నాపుత్త్రుండగు దామోదరుం డవు; నేను నీజనయిత్రిని.

అని యాయింతి యాతండు దామోదరుం డవుట కనేక నిదర్శనంబులు సెప్పి బుద్ధి మరలింప నిట్లనియె. దామోదరా! యిపుడు నీ వున్నగది నీదియె కదా. ఇది సార్వభౌమున కర్హం బగునది కాదని నీకుఁ దెలిసియేయుండు. అసంభవములగు వృత్తాంతముల నమ్మకుము. నాపల్కులం గ్రమంబుగఁ బరిశీలింపుము. అనుడు దామోదరుండు కన్నులుమూసికొని తల్లి చెప్పినబుద్ధులలోని యథార్థంబు కొంతవఱకూహించునట్లుండి, యనంతరము నిద్రమేల్కాంచినట్లుగ లేచి కన్నులు విచ్చి తల్లి కిట్లనియె. అమ్మా! నే దామోదరుండ నగుదు. నీవు నాతల్లి వగుటకు సందియంబు లేదు. ఇది నాగదియే యని తోఁచుచున్నయది. అని నలుగెలంకులఁ జూచి యిదియంతయు నిశ్చయంబే కాని, నాకిట్టి మతిభ్రమణం బెట్లు సంప్రాప్తం బయ్యెనో, దాని నూహింప నలవిగాకున్నయది.

అనిపలుకుచున్న దామోదరుం జూచి యతనితల్లి నిజముగఁ దనకొడుకు పిచ్చికుదిరె ననియెంచి నవ్వుచు నది స్వప్నం బనియు, దాని తెఱం గెట్టిదియనియు సంప్రశ్నంబులు గావిం

చుచునుండె. అంత దామోదరుండు దిగ్గనలేచి 'యోముసలి దయ్యమా పొమ్ము పొమ్ము. నీమాటలు నీకే తెలియవు. నీవు మాకుఁ దల్లివిగా నెట్లు తగుదువు? మేము దామోదరుండగు టెట్లు గల్గు? మేము సార్వభౌముల మగు విష్వక్సేనమహారాజు లము. కావున నీకనైన మాకెవిరిపలుకఁ దలఁపకుము.' అనుడు నాతనిజనయిత్రి యిట్లనియె. ఓదామోదరా! నీపుణ్యముగాని యీమాటలు మాని క్రొత్తవృత్తాంత మేదియైన నుడువుము. అటుగాకున్న మనకు నేదిగ్గైన విపత్తు సంభవిల్లు. నీ కిపు డొక వృత్తాంతంబు సెప్పెద వినుము. అని గతదినంబున దండనాథుండు వచ్చి నఁబులఁ గొట్టించి వీథులం ద్రిప్పించిన వృత్తాంతంబు దెల్పి, నీవు నిన్న నే యూరికిం బోయియుంటం జేసి దీనిఁ దెలియవైతి కాని సీవూరనేయున్న జాలిఁబడకపోవు అనెను. ఈకార్యంబునకు దామోదరుండే కారకుం డని యెఱుఁగక దీని విని దామోదరుండు భీకుం డవు నని తలంచెఁగాని దానిచే తనే యీతండు ధీరుం డయ్యె.

దీనినంతయు విని దామోదరుండు ససముత్సాహుండై లేచి యిట్లనియె. ఓసివెఱ్ఱీ యిపుడు స్పష్టంబయ్యె. నే నీపుత్రుం డనుగాను; దామోదరుండనుగాను, విష్వక్సేనసార్వభౌముం డను. ఇప్పుడు నీచెప్పినకథ వినిన నాకు సంశయంబు రహితంబయ్యె. కదలించితివి గానఁ జెప్పెద వినుము. నాయాజ్ఞచేతనే నిన్నటిదినంబున నంబులందఱు శిక్షితులైరి. వీరిం గొట్టించిన నేను సార్వభౌముండనే యగుదు. అందుకు సందియం బేల? కావున నీక నిది కలయనిమాత్రము పలుకవలదు. అప్పుడు నిప్పటివలె నిద్రం జెందక మేల్కొని యుంటిని. నాయాజ్ఞాను

సారంబుగ దండనాథుండు కార్యంబు నడపినవాఁడు. మాటఁ దెల్పి మేలొనర్చితివి. ఆనంబులు శిక్షితులైనమాట మఱల వినుటచే సంతోషం బతిశయంబయ్యె. ఇపు డిట కేనెటుల వచ్చితినో, తెలిసిన పరమానందం బగు. కానీ దేవుఁ డున్నాఁడు. సార్వభౌముండవు నీవు గావని యిపుడు నీ వలనఁ జెప్పంబడిన యుక్తు లన్నియు నిరస్తంబు లయ్యె. ఇఁక నేమి సేసెదు? అనుడు నావనిత దామోదరుం డింతయొత్తిచెప్ప టకుఁ గారణంబేమైన నుండునా యని యూహింపక తప్పక యాతండు మతిహీనుం డయ్యెనని నిశ్చయించి కొడుకా దేవుండు నీజాడ్యంబుఁ గుదిర్చి నిన్నుఁ బ్రజలం గలుపవేఁడెద. ఇట్లీవు మతిమాలి మాటలాడిన దీనిం దెలిసికొనక లోకమె ట్లనెదరో యూహింపుము. గోడలకును జెవులున్న వన్నమాట మఱవకుము. ఇతరులు వినిన లోకమంతకుం దెలియు లోవి మాయ మూఁకుడున్నదిగాని లోకముమాయ మూఁకుడుగలదా! కావున ని న్నెఱిఁగి మఱిమాటాడుము.

అని యిట్లు తల్లిచెప్పిన బుద్ధులన్నియు దామోదరుని కడఁ గృతఘ్నునియెడఁ బ్రయుక్తంబులైన మేలులంబలె నిష్ఫ లంబులయ్యె. అపుడు దామోదరుం డంతకంతకుఁ గోపం బగ్గ లంబగుడుఁ దల్లి కిట్లనియె. ఓముసలి నీ కీవఱకు బుద్ధిసెప్పితి. దానింబట్టి వృత్తాంతం బరయక కోపించుచున్నావు. మాటల నలిగెదేని ప్రేటున శిక్షించెద- నేను జగంబేలు విష్వక్సేనసార్వ భౌముండ నని యిపుడైన నమ్ముము. అనుడు నాయింతి కొడు కునకు మతిభ్రమ యతిశయిల్లె నని నిశ్చయించి గత్యంతరంబు కానరాకుంటం జేసి ఱొమ్ము మోఁదుకొనుచు రోదనంబు సేయ

సాగె. దామోదరుం డట్టి తల్లిం జూచి సదయుండుగాక గౌర వంబేది ప్రేమదిగనాడి క్రుద్ధుండై యొక బెత్తంబెత్తి జళిపించుచు నోమూర్ఖవనితా! నేనెవ్వండనో యిప్పుడు సెప్పుమనుడు నాయమ యతిప్రేమతోఁ బుత్రుంజూచి యిట్లనియె. కొడుకా నినుఁబెంచి పెద్దవానింజేసిన నన్ను నీవు మఱచిన నిన్నే మఱ వను. నీవు నిజముఁగ నాతనూజుండవు దామోదరుండవు. నిన్ను మనకు విశేషసన్మానంబు గావించి రక్షించిన యౌదార్యనిధి యగు విష్వక్సేనసార్వభౌముండు సుఖరైయియుండ నీ వాతండ నైతి ననుట భ్రమగాదె? మఱచితి నింకొకవార్తఁ దెల్పెద వినుము. నిన్నటిదినంబు సార్వభౌముండు పంప సుధీరంజనా మాత్యపుంగవుండు లక్షవరాలు దెచ్చి మనకుఁ బారితోషికం బుగ నిచ్చి సార్వభౌమునకు దీవన దయసేయు మని ప్రార్థించి చనెను.

అను జనయిత్రి పలుకులకు దామోదరుండు మఱియు వెఱ్ఱివాఁడయ్యె. సార్వభౌమునిదాతృత్వంబు దెలుప నావెఱ్ఱి క్రచ్చినవృత్తాంతంబువలనఁ బూర్వదినంబునఁ దాఁజేసిన దాతృ త్వంబు జ్ఞప్తికిఁ దెచ్చుకొనితోడన తా సార్వభౌముండౌట మఱియు నిశ్చయంబుసేసికొని తల్లింజూచి, యోపిశాచీ యిటు వినుమని యిట్లనియె. నిన్న నీకు ధనంబు పంచినది నేన యని తెల్పిన నీసందియం బింకనైనమాను నే, సార్వభౌముల మగు మాయాజ్ఞానుసారంబుగ మామంత్రివర్యుండగు సుధీరంజ నుండు నీకు ధనంబు తెచ్చియిచ్చె. ఇదియంతయు నిట్లుండ మావాక్యంబులయందలి యథార్థంబు నమ్మక మము వెఱ్ఱియ నియు, నీకొడుకనియు మొఱకుఁదనంబునఁ బలుకుచున్నావు.

కావున నీవు దండమునకే తగియున్నావు. అని పండ్లు పటపటం గొఱికి లేచి నిలువంబడి భీషణాకారుండై తనచేతిబెత్తంబునం బసరముంగొట్టిన ట్లావెను గ్రూరంబుగం గొట్టె. అవెట్టి యిల్లాలు తనకొడుకు కంతలో మాటలనుండి ప్రేటునకు వచ్చునని యూహింపదయ్యె. అనంతర మాయింతి చేయునదిలేక చచ్చితిం జచ్చితి నని యొగ్గెత్తియఱచిన నిరుగుపొరుగువా రందఱు నేమి యేమి యని పరువులెత్తి వచ్చిరి. దామోదరుండు నే సార్వభౌముండ నాదునా యథార్థము చెప్పు మని శిక్షింపఁదొడంగె. దాని కాయింతి వాత్సల్యంబున నీవు నన్నెన్ని కొట్టిన నాపుత్రుండవె కాని పరుఁడవు కా వనె.

అహాహా చూడుఁడు! ఈయిరువురును యథార్థమగు వృత్తాంతమునకు విమర్శలేమింజేసి యొట్టిదశకు వచ్చిరి. కుటుంబ కలహములకు విమర్శయె తారకంబు. అది యొక్కటి తక్కువ దైన నాగృహస్థును బంచమహాపాతకంబులు బానిసగంజేసికొని పరిచర్యలుగొనుట కేమి యబ్బురంబు.

ఇరుగుపొరుగువారలు లోనికిం జనుదెంచువఱకు దామోదరుని కోపంబు కొంచెము కొంచెము శాంతింబొంద నారంభించె. వారిలో లోనికిం జనినమొదటివాఁడు తల్లికొడుకులనడుమం బ్రవేశించి దామోదరునిచేతిబెత్తం బూడంబెఱికికొని యిట్లనియె. ఓరి దామోదరుఁడా! యే మీదురంతము భగవంతునిభయ మింతైనలేదే? నీవంటి కులీనుండు కులహీనుని భంగి నెన్నండైన నిట్లు తల్లిం గొట్ట యత్నింపఁజూచునా? నిన్నుంజూచి యొరులు నవ్వెద రూరకుండుము. నినుం గని కన్నులం బెట్టికొని పెంచిన తల్లిం గొట్ట నీకుం జేతు లెట్లాడె, సిగ్గింతైన వలదె? అనుడు

దామోదరు డుత్తరం బేమియు నీయక తనతో మాటలాడు వానిని తక్కుంగలవారినిఁ దప్పక చూచి వెఱ్ఱివారా! మీరు మాట్లాడు దామోదరుం డెవ్వాఁడు? సాహసభాషులనగు మమ్మా మీరిట్టి తుచ్ఛనామంబునఁ బిలుచుచున్నారు? అను దామోదరుం జూచి వారందరు భయమందిరి.

వారిలో నొకఁడిట్టిరి ధైర్యంబుఁ దెచ్చికొని యిట్లనియె. దామోదరా నినుఁగని పెంచి పెద్దవానింజేసిన తల్లి యిప్పుడు నీ చేష్టల జ్ఞప్తికివచ్చు. లోకంబునఁ బుత్రులఁ బడయఁగోరుట యిట్టిసుఖ మనుభవింపనేకదా. చాలుఁజాలు! మాతృపూజ గావించి నీఋణమంతయుఁ దీర్చికొంటివి. ధన్యుండ వైతివి. అనుడు దామోదరుండు క్రుద్ధుండై పొండు పొండని యిట్లనియె. ఏ మేమి! మీకు మాయెడ భయంబు లవంబైన లేదే, ఆముసలిని మిమ్ము నే మెఱుఁగను. మీ రెవ్వరో తెలిసికొను నవసరంబును మాకు లేదు. మావృత్తాంతంబు మీకుఁ గ్రమంబుగఁ దెలియు నట్లొనరించెదము.

అను దామోదరుంజూచి వారందఱు నాతని మతిలేని వానిఁగ నూహించి, యూరకున్న నింకను దుర్మార్గంబులు గావించునని యెంచి నల్గురైదుగురు పైఁబడి పట్టుకొనిరి. దామోదరుండును గంటిచేతం బంటిచేతను బెదరించి వారి నదలించి తనయధికారంబు చూప గమకించిన వార లాతని తెక్కపై తెక్కవేసి యంటఁదీసి కట్టిరి. ఆలోన నొకఁడు వైద్యశాలకుం జని యావర్తమానం బాశాలాధ్యక్షున కెఱిఁగించె. తోడనె శాలాధ్యక్షుని యాజ్ఞానుసారంబుగ బెత్తంబులును గొలుసులును సంకెలలును బూని వైద్యశాలాకింకరులు భయం

కరంబుగ వచ్చి నిల్చిరి. శాలాధ్యక్షుండును నేతెంచె. వీరికాకకు భయంపడక దామోదరుండు వదలించుకొన మిగుల యత్నించె. అపుడు వైద్యశాలాధ్యక్షుం డచ్చోఁ జుఱుకుచుఱుక్కున నాలుగైదు దెబ్బలు బెత్తంబుతో వంటించినఁ గిక్కురుమనక దామోదరుండు వారు కట్టినఁ దిట్టిన మొట్టిన నూరకుండె. అనంతరము దామోదరుని వైద్యశాలాప్రవేశంబు సేయించిరి. శాలాధ్యక్షుండును దామోదరుని గదిలోని కనుపుచో బెత్తంబుతో నొక్కశతమానంబు గొట్టె. ఇట్టులే యనుదినంబును మూఁడువారంబులదనుక దయాదాక్షిణ్యంబులు వదలి శాలాధ్యక్షుండు దామోదరుని సార్వభౌముండ ననవుగదా! అనవుగదా అని మఱిమఱి కొట్టుచువచ్చె. అత్యుత్కటములైన పుణ్యపాపములఫలం బీలోకంబుననే యనుభవింపవలయు నను బుధజనోక్తి యథార్థ మగునట్లుగ దామోదరుండు మాతృపూజాఫలంబు కోటిగుణితంబుగ వెంటనే యనుభవించె.

దామోదరునిమాత ప్రతివాసరంబును కొడుకుం జూడఁ జనుచుండు. అచ్చట నాతండు పడు బన్నంబులఁ జూచి కన్నకడుపుగాన మిగుల వగలఁ గుందుచుండు. దామోదరుండు తన ప్రక్కలును భుజంబులును వీఁపును దెబ్బలకుఁ గమిలియుండు టం జేసి మెడద్రిప్పనైన సమర్థుండు గాకుండె. ఇట్లున్నను దామోదరుండు తల్లివచ్చి సార్వభౌముఁడవు నీవు కావుసుమీ, యని బోధించుచోఁ బదిలిట్లు తిట్టి యామెను సాగఁదోలుచుండును. ఇట్లుండఁ గొన్ని దినంబులరుగ్యె.

అంత నొకనాడు దామోదరుండు తాసింహాసన మెక్కుటయు, తనయాజ్ఞానుసారంబుగఁ గార్యంబునడుచుటయు, కల

లోనివార్తగ భావించి దాని యథార్థముం గూర్చి సంశయింప నారంభించి యొకసమయంబునఁ దనలోఁ దానిట్లు చింతించెను. నేను నిజంబుగ సార్వభౌముండ నగుదునేని యీ కట్టుబట్టలతో నాటికుటీరంబున కేలవచ్చితి? నా చుట్టును యువతీజనంబును, పరిచారకులును బరివేష్టింపకుండుటకుఁ గారణంబెద్ది? నాకుఁ బాదాభివందనంబునేయు నా ముఖ్యామాత్యుండగు సుధీరంజనుండును, తక్కుంగలసామంతమంత్రిజనంబులును, తదితరదేశాధిపతులును, నన్నిట్టి యాపత్సమయంబున నొంటిగ నేల విడనాడుదురు? నాకు నిజముగ వారిపై నధికార మున్న నొక్కపెట్టునవచ్చి నా యీదురవస్థ తొలగింపకుందురే. కావున నాతొల్లింటి యభిప్రాయంబంతయుఁ గల యనుట కొక సందియంబును లేదు. అని యానంబుల శిక్షింపఁబంచినది మాత్రము నేన యగుదు. సుధీరంజనుని చేతికి సొమ్మిచ్చి మాతల్లి కిమ్మని తెల్పినవాఁడను నేన యగుదు. దీనింబట్టిచూడ నిది కల గాదనియుం దోఁచెడిని. అయిన నేమాయె. వీనికంటెను బలవత్తరములగు యుక్తు లనేకము లీవృత్తాంతమునకు బాధకములు నగపడుచున్నవి. ఇదియంతయు భగవన్మాయగఁ గాన్పించు. ఇందులనిజంబు దైవమునకే తెలియవలయు.

అని దామోదరుం డిట్లు చింతించుచుండ నీతనిం జూడ నీతనితల్లి చనుదెంచి యప్పటి యీతనిచర్యలన్నియు భేదంబులుగ నుండుటకెంతయు సంతసించి కొడుకా! యేమి సేయుచుంటి వనుడు, నమ్మా సుఖముగ నుంటి నని దామోదరుండు సుముఖుండై యుత్తరంబిచ్చె. అది యొకశుభసూచకంబని యెంచి యాపె సమీపించి స్థితిగతు లడిగి దయ్యంబు సోఁకు

ంచేఁ గల్గిన మతిభ్రమణం బె ట్లున్న దనుచు నాతండు స్థిరచిత్తం బున నిట్లనియె. ఓజననీ! నాతప్పిప్పటికిం దెల్లంబయ్యె. నీయెడ నేఁ గావించిన యపరాధంబునకు నాతనువుపై రోఁతపుట్టు చున్నది. ఈ నాశరీరంబు గాల్పనే. నాతప్పు మన్నించి నను దుర్గతిపాలుగాకుండ రక్షింపుము. నాచే నవమానితులైన మన యిరుగుపొరుగువారిని నాతప్పులు సైఁపఁ బ్రార్థించుచున్నానని తెల్పుము. నా శోకకలచే మోసంబయ్యె. ఆ పాపిష్ఠిస్వప్నం బెట్టివారినైన నిజమని భ్రమింపఁజేసి యిట్టిదుష్కార్యంబులు నేయించుననుటకు సందియంబు లేదు. ఇప్పటికి నాకది కలయనియు దానిచే నేభ్రమసితిననియుఁ దోఁచుచున్నయది. సార్వభౌముం డెక్కడ నే నెక్కడ? మాయిరువురకు హస్తిమశకాంతరమున్న యది. నే నీతనూజాతుండ నగు దామోదరుఁడను. బ్రతికి యున్నంతవరకు సిగ్గుచు విపత్తును దెప్పించిన యామృత్యుశ్రీ సమానమైన దినంబు మఱవను. నేటినుండి నాజీవముండు దనుక యథార్థగౌరవంబుల నినుఁ బూజించెద.

అను దామోదరు సహేతుకవాక్యంబులచే నాయింతికి నానందాశ్రులు జడిగఁ గురిసె. అపు డాయంగన దుఃఖంబంతయు మఱచి యిట్లనియె. కొడుకా నీవు యుక్తియుక్తముగ మాట లాడుటంజేసి నామనంబు సంతసంబున నెంతయు నుప్పొంగు చున్నయది. మన వృత్తాంతమం దొకముఖ్యాంశంబు నీతోఁ జెప్పమఱచితి. దాని నీవును గనిపెట్టియున్నట్టు గావరాదు. నీతోడ నాటిరాత్రి భుజింపవచ్చినవర్తకుండు తాఁజనునపుడు నీకోరినట్లు తలుపు మూయఁడయ్యె. దానిచే నేదియో గాలి యొకటి లోనికిం జనుదెంచి నిన్నావహించి నీ కిట్టి నిర్బంధంబు

గల్పించె. ఇపు డీశ్వరకటాక్షంబున నీ వాకత్సముద్రంబుదాఁటి గట్టెక్కితివి. కావున! నాసర్వేశ్వరు నీకెన్నటికి గ్రహభయంబు లేకుండఁ గాపాడి నీరోగశతాయుష్య మియ్య వేఁడెద. అనుచు తల్లిం జూచి యమ్మా నీవీ విపత్సముదయంబునకు మూలం బారసితివి. అవ్వనవ్వను. అనాటిరేయియే నాకిట్టి మతిభ్రమణ కారకంబగు స్వప్నంబయ్యె. అవర్తకుం దలుపు మాయయుమని బలిమాలుకొంటనిగాని యతండు మాయక చనినట్లు తోఁచెడిని. నీచెప్పినట్లు దయ్యం బేదియో సోఁకి నాకిట్టి మనస్తాపంబు గల్పించె. సందియ మేల? ఈశ్వరానుగ్రహంబున నా జాడ్యం బంతయుఁ గుదిరె. కావున నన్నిఁక నింటికిఁ దోడ్కొనిపొమ్ము. అనుడు నాయింతి కొడుకు త్రోవకువచ్చెనని నిశ్చయించి వైద్యశాలాధ్యక్షునకు నవ్వార్త వైళంబ యెఱిగించిన నాతండును దామోదరుం బరీక్షించి చెఱనుండి విడిచె.

ఇది ప్రథమ వీచిక.

# చిత్రరత్నాకరము

## ద్వితీయ వీచిక



అనంతరము దామోదరుం డింటికి వచ్చి దేహంబున జవసత్వంబులు నేరుపఱకును వీథిమొగంబు త్రొక్కి చూడకయింటనే కూర్చుండి విశ్రాంతి గొనుచుండె. ఇట్లుండఁ గొన్ని దినంబులకే యెప్పటియట్ల ప్రాణంబు కోలుకొనిన నాతండు రాత్రులం దారోంటిగఁగూర్చుండి భుజియించుటకు వేసటి తొంటియట్ల మరల నతిథికి నభ్యాగతునకు నన్నంబువెట్టుచుఁ గాలయాపనంబు సేయ నిచ్ఛగలవాఁడయ్యె. కావున దానికిం దగుసామగ్రి ప్రాతఃకాలంబుననే తెచ్చియుంచి తా నాసాయంకాల మెప్పటియట్ల యతిథికై వేచియుండ నిశ్చయించె. ఇట్లు దామోదరుం డుద్దేశించినదినం బానెల తొలిదినంబు. ఆ దినంబె విష్వక్సేనసార్వభౌముండు మాఱువేషంబున బట్టణంబంతయుఁ జూడ బయలువెడలునది. దామోదరుండు నంతకుమున్దే తత్పురీపురోభాగంబుననున్న వారధికడకుఁ జని యచ్చోఁ గూర్చుండి యతిథికై నలుగెలంకులఁ బరికించుచుండె. అట్లు చూచుచుండ నీవర్తకవేషంబుననున్న సార్వభౌముండు నాతని పరిచారకుండు నీ దామోదరున కక్షిగోచరులైరి. అపుడు దామోదరుండు తన యాపదలకు మూలపదంబైన తొంటి వర్తకుం జూచి తోడన మూర్ఛనొంది కొంతవడికిఁ దెలిసి దైవమా నాకింత

దిక్కెయ్యెడిది? ననుఁ బన్నములపాలు సేసిన దుష్టాత్ముల పోతు యిదుగో, మఱల వచ్చుచు నున్నాఁడు. నన్ను రక్షించువార లెవ్వరున్నారు? అని లేచి మొగంబుత్రిప్పి యెఱుఁగనట్లు నది నీటిం జూచుచునుండె.

అవలఁ విష్వక్సేనుండు దామోదరుం డింటికిఁ జనిన యనంతర మొనరించిన చమత్క్రియావితానంబు సాంతంబుగ విని యాతండు వైద్యశాలం జేసిన రాచకార్యంబునకు నెంతయు ముదితుండయ్యె. ఈమహామహుండు ధర్మాత్ముండు నుదారుండు నవుటచేతను, దామోదరునకు మిక్కిలి నూర్పువాఁ డవుటచేతను, అతనిఁ దనమందిరంబునకుఁ దెచ్చి సత్కారం బేమిరైన చేయునిష్టంబున నుండె. ఇట్టి స్వాభిప్రాయంబు నెఱవేర్పఁ దాఁదొల్లింటి వర్తకవేషంబె మరలఁ గైకొని బయలు వెడలె.

తన్నుం జూచి దామోదరుండు మొగముతప్పింపఁ దల ద్రిప్పిన నాతనియభిప్రాయం బెఱింగి, ఆతండు నిలువంబడియున్న స్థలంబునకుఁ జని యాతని మొగముపై మొగముంచి చూచి సార్వభౌముడు మిత్రమా దామోదరా! యిచట నే నిలిచి యున్నావా? ఎన్నిదినఁబులకుం జూచితి! ఆలింగనమున కొజ్ఞ యొసంగుము. అనుడు దామోదరుం డాతనిఁ జూచుటం జూచి మార్దవహీనంబులైన వాక్యసముదయంబుల నిట్లనియె. పొమ్ము పొమ్ము. నీకు నేమిత్రుండను గాను. నీకు నాయాలింగనంబు కోర నవసరంబును లేదు. నాతో మాటలాడ నవసర మున్నట్లును గానరాదు. అనుడు సార్వభౌముం డిట్లనియె. అయ్యయో దామోదరా నన్ను మఱచితే? క్రిందటి

నెల నీనాటిరాత్రి నేను మీయింట భుజించిన యతిథిని గానె. మనము నవ్వుచు మాటలాడుచు సంతసంబున నున్నది జ్ఞాపకము లేదే. ఆరాత్రి నాకీవుచేసినగౌరవంబు నీవు మఱచితివి కాని నే మఱచితినా? అది నాయుస్థిం బట్టియున్నది. అనుడు దామోదరుండు మొగము ముడిచికొని యిట్లనియె. అవిగో. నడుపుము నడువుము. నిన్నును నే నెఱుఁగ, నీసల్కువృత్తాంతముఁను నేనెఱుఁగ. నీకెద్దియేని పనియుండనోపు, పొవపొవ. అనుడు సార్వభౌముం డాతని మార్దవరహితంబులైన మాటలకు నలుగకయుండియుఁ, ఒక్కసారి తనయింటఁగుడిచినయతిథితో నెన్నండును సంభాషింప నను దామోదరుప్రతిన నెఱిఁగియుండియుఁ దెలియనట్లుండి యాతనితో నిట్లనియె. ఓ మిత్రమా! నను నీవెఱుఁగ నన నే నెట్లు నమ్ముదు. ఇంతస్వల్పకాలంబున నను నీవు మఱచిపోవుట యసంభవము. ఈమధ్యకాలములో నీకెయ్యదియైన నొకవిపత్తు సంభవించి యుండనోపు. దానివలన నీమనంబు తత్తఱపడియుండు. అట్టిది యేమున్నను నాయట్టివానిమీఁద నాగ్రహింప నేమిలాభంబు? నాలాభంబునై నవదలి నాచే నగుకార్యంబు నిర్దుష్టంబుగఁజేసి కృతఘ్నుండనుగాక కృతకృత్యుండ నైతిననిన మాట నీమనంబునకును గోచరంబై యుండనోపు. అనుడు దామోదరుం డిట్లనియె. నీలాభంబును నే నెఱుంగ. దాని నే ననుభవింపఁ గోరుటయు లేదు. నాకు నీ వొనర్చిన సంపూర్ణోపకారంబొక్కటిమాత్రము గలదు. దానిచే నాకు మతిభ్రమణంబు గలిగె. ఇట్టికార్యంబు నేసి నీవు కృతకృత్యుండ వైతి ననుటకు సంశయంబు లేదు. నను వదలిపొమ్మని యింకొకసారి

ప్రార్థించెద. నీపుణ్యంబుగాని నీవిఁక నను వేధింపక నీత్రోవం బొమ్ము.

అనుడు విష్వక్సేనుండు దామోదరుం గౌఁగిలించి యిట్లనియె. అయ్యయ్యో మిత్రమా! నాయదృష్టవశంబున నిను రెండవసారి గన్గొంటి, దానిచే నాసంతోష మినుమడించుచున్నది. నీ వీవిధంబున నుండ వదలిపెట్టి పోవ మనసు రాకున్నది. మున్ను నీతో భుజించుసమయంబున నెటుల నను గారవించితో, అటులే నన్నిప్పుడు నాదరింపందగు. అనవుడు దామోదరుం డాతనిం జూచి నీయట్టివానితోఁ బొత్తెన్నండును గల్గకుండ నుండున ట్లీవఱకే నేను నిశ్చయించుక యున్నాను. నీవ నావిపత్సముదయంబునకు హేతుభూతంబవు. ఇఁక నిన్నెన్నండును నమ్మంజనదు. అనవుడు విష్వక్సేనుం డాతని మరలఁ బరిరంభణ మాచరించి యిట్లనియె - మిత్రమా! నన్నిట్లు నోనాడ నీకు న్యాయంబగునా? నను నిజముగు హితునిగ నెంచఁదగు. నాయెడఁ గృపయుంచి సంప్రాప్తంబైన విపత్తు దెలుపుము, అది నిజముగ నాయపరాధంబే యగునేనిఁ దగు నుపకారంబు నేసి నాతప్పు వాపికొందు. అనుసార్వభౌముని వినయపూర్వక విజ్ఞాపనంబునకు దామోదరుమనంబు కరఁగి సుముఖుండై యాతనిఁ గూర్చుండు మని యిట్లనియె. ఓయీ! నీదీనాలాపంబులచే నాయాగ్రహంబు నిగ్రహింపఁబడియె. నేఁజెప్పెడి వృత్తాంతంబు విని నిను నే నిష్కారణముగ ద్రోహబుద్ధిచే నిందించితినో, లేక సకారణంబుగ నిందించితినో తెలియుము.

అనుడు వల్లె యని విష్వక్సేనుం డాతని సమీపమున గూర్చుండియుండె. అపుడు దామోదరుఁడు తాఁ దొల్లి రాజ

మందిరంబున మేల్కాంచుటయు, పిమ్మటఁ దనయింట మేల్కాంచుటయు, ఆయాసమయంబుల జరగినవృత్తాంతంబును, చిత్రకథలును సాంతంబుగ నొకకల చెప్పినట్లు చెప్పిన దానినంతయు, నాతఁడుంబలె నెఱిఁగిన సార్వభౌమున కాతండు వాక్రుచ్చు విధంబు నవ్వుం గల్పించె. అది గని దామోదరుం డిట్లనియె, ఓయీ నీకింత యచ్చెరువు పుట్టించునట్టియు, నీవింతకు నూహింపనట్టియు, నీవృత్తాంత మంతకు మూలకందం బీవ సుమీ. ఇది యంతయు నీదోషంబ కాదె? ఏమంటేని జ్ఞప్తికిఁ దెచ్చుకొను మొకవార్తఁ దెల్పెద. నీతో నే నానాటిరాత్రి తలుపుమూసి చను మని చెప్పియుంటి. దాని నీ వసడ్డ చేసితివి. అప్పుడేదియో యొకపెనుభూతంబు లోనికి నేతెంచి నన్నావహించి నే నిట్టి కలఁ గనున ట్లొనరించె. కల మిగుల సొబగైయున్నను దదనంతరఫలము కష్టములపాలౌటయే యయ్యె. అది యంతయు నీవు నావాక్యంబు పాటింపకుండుటచేత నేగదా సంప్రాప్తంబయ్యె. నీవ మాతల్లిం గొట్టించిన పాపంబునకుఁ గారకుండవు. ఆపె నన్నూరక సార్వభౌముండవు కావు నాకొమరుండవు సుమ్మని తెల్పుటచే నాయమను జంపను గూడఁ దలంచితి. ఇంతియకాక నాయిరుగుపొరుగువారందఱు నా దుష్కార్యంబు కన్నులారఁ జూచిరి. ఇది సార్వకాలికవిచారంబును లజ్జనుం బుట్టించుచు మఱచిన మఱపురాక యున్నయది. అని తన వృత్తాంతంబు దామోదరుండు కోపాటోపంబున నెల్గెత్తి పలికె. మఱపుచే నందొక లవంబైనఁ గొఱంతయుంచఁడయ్యె. ఇట్లు నిష్కపటంబుగఁ జెప్పిన దామోదరువృత్తాంతంబున కాతండెంతయు సంతసించి, యాతఁడు వాక్రుచ్చుపణితిం జూచి కడు

పుబ్బ నవ్వుచు వచ్చె. తనవృత్తాంతంబు వినుటవలన నెట్టి వారును విశేషంబుగ జాలినొందుదురని నిశ్చయంబుతో నున్న దామోదరుం డాకృత్రిమవణిజుం డంతగ నవ్వుట కెంతయుఁ గనలి యిట్లనియె. ఏమీ నాకష్టంబులు నీకింత పరిహాసాస్పదంబులై కాన్పించుచున్నయవి కాఁబోలు. నే నీతో బూటకంబులాడితి నని యనుకుంటివేని నీకు నిదర్శనంబులు సూపెదఁ జూడుము అని తన వీఁపుఁ జూపి యందున్న వేత్రచిహ్నంబుల నగపఱిచెను.

ఆవీఁపు చూచి సార్వభౌముండు దామోదరునెడ సదయుండై యాతనిగతికి మిగుల వగచి నవ్వులకుం బోయిన ననగ్ధాతిశయం బయ్యెనని యెంచి యాతని గ్రుచ్చికౌఁగిలించి యిట్లనియె. నేటిరేయి మరల నాకు నీపొత్తునం గుడిచి సంతసంబున నుండుభాగ్యంబు గలుగనిమ్ము. భగవత్కటాక్షంబు పూర్ణంబుగ నున్న నీకష్టంబులెల్ల నెల్లి గట్టెక్కు.

అనుడు దామోదరుం డెట్టిపతిన వట్టియున్నను, తన నిశ్చయం బెట్టిదియై యున్నను, సార్వభౌముని మృదుతర వాక్యంబులకు మాఱాడఁజాలక యిట్లనియె. దయ్యంబు మరల వచ్చినను బాధింపకుండ నీవు చనుచో వీధి తలుపు మూసెద నని యొట్టుపెట్టుకొనుదేని నే నీయిష్టానుసారంబుగ నడిచెద, అనుడు నాతండు దానికి సమ్మతించె! అనంతర మాయిరువురు లేచి పరిచారకుండు తోడనడువ దామోదరుగృహంబునకు నిరులు గ్రమ్ముచుండ నేతెంచిరి.

దామోదరుం డింటికివచ్చినతోడనే విశేషంబుగ దీపంబులువెలిఁగింప నాజ్ఞయొసంగి, తనయతిథిం గూర్చుండ నియ

మించి భోజనపదార్థంబులు సిద్ధంబు సేయించె. అనంతర మా యిరువురును గలసి మెలసి యిష్టమృష్టాన్నంబులుగొని ఫలాహారంబులు గైకొనిరి. అపుడు దామోదరుండు ద్రాక్షరసాయనంబు తెచ్చి యాతనికిగిన్నెలో నుంచి తనదానిలోఁ బోసికొని కొంత మాని సరససల్లాపంబులాడుచుండె, సంతసంబున దామోదరుండు లోకంబులోని వృత్తాంతంబులు మాటలాడుచుండ, నిదియతఱి యనియెంచి విష్వక్సేనుం డతని మఱికొన్నిమాటలలోనికి డించి వివాహమున కిష్టమున్నదా యనియు శృంగారంబానందదాయియే యనియు నడుగం గొడంగె.

దానికి దామోదరుండు నిష్కాపట్యంబుగ నిట్లనియె. ఓ హితుఁడా అడిగితివిగానఁ దెల్పెదను వినుము. నీ యడిగిన దానికి నా కిష్టంబు లేక యుండలేదు. దాని కనేకబాధకము లున్నవి. మానవునకు స్వేచ్ఛాభంగంబగు వివాహం బైనపిదప నేకారణంబుచేనైన నాతని చూచి, చూడకున్న బురుషుని తాతిగుండెవాఁడెవాఁడని జనులు నిందింతురు. కలసిమెలసి యున్న లోకులు స్త్రీలోలుఁడని యధిక్షేపింతురు. ఇట్టిబాధలఁ బడుకంటె నూరకుంట మేలని నే నెన్నండును బరిణయంబునకు యత్నింపనైతి. నా కీద్రాక్షరసాయనంబును సరససల్లాపంబులు నిష్టమైన ట్లనన్యములు కావనుమాట నీవు నెఱుఁగుదువుగద. ఇంతయేల నాహితులఁ బూజించుటయు, వారితో సంతసంబునఁ గాలంబుగడపుటయు, నాకు ముఖ్యంబు, ఐన సొగసరియగు చిగురుఁబోఁడి దొరకనేని బరిణయమగుటకుఁ బట్టింపులేదు. ఎట్టి రూపవతి యని యడిగితివేనిఁ జెప్పెద వినుము. మున్ను నీవు నాతోడ భుజించి కొంతతడవు సంభాషించి తలుపుమూయ.

మఱచి నన్నా పదలపాలు సేసిననాటిరాత్రి స్వప్నంబునఁ గాను పించి యాటలపాటల నాడెందంబు కరఁగించి యలరించిన యాసరసిజముఖులం బలె సౌందర్యప్రావీణ్యాదులకు నిదానంబు లగు సతులున్న నందొకదానిఁ బ్రీణసంబునఁ గైకొనుటకు సందియంబు లేదు. అహాహా! నాకట్టి చెలితోఁ గూడియుండు భాగ్యం బెన్నండైన దొరికిన నే నానందసముద్రంబున నోలలాడకుండుదునే? అట్టి సుందరాంగులు సార్వభౌమునియంతిపురమందును, మంత్రిశిఖామణిభవనాంతరంబునందును, సామంతజనావాసంబులందును వసియింతురు. అట్టివారిం గోరుట యందరానిపండ్లకు నఱ్ఱుసాచుట కాదె! కావున నేనట్టివృథాప్రయత్నంబులకుఁబోక యీ ద్రాక్షరసాయనంబు చల్లగ నుండఁగోరెద. దీనికి వెల సులభంబును ఫల మధికంబును. అని మరలఁ దమ గిన్నెల రసాయనముంచి నీచెప్పినసంగతి కేమితొందర కానిమ్ము. దీని నాని యిపుడు సంతసింతము, రమ్ము రమ్మని సార్వభౌముతోఁ బలికె.

అపుడు విష్వక్సేనుండు దామోదరుంజూచియయ్యా యో నీయట్టిబుద్ధిమంతుండును, రసికుండు నిట్లొంటిగనుండి కాలంబు గడపం జూడ జాలియయ్యెడిని. అనుడు దామోదరుం డిట్లనియె. ఒక యరూపవతిం బెండ్లియాడి దానిగుణాగుణంబు లరయుచు మనస్స్వాస్థ్యంబు చెడగొట్టుకొనియుంటకంటె నెప్పటియట్ల నిర్బాధకంబుగ కాలంబు గడపుటయే లెస్సయని యూహించెద. అనవుడు విష్వక్సేనుం డాతనింజూచి వివాహం బిహపరసాధకం బనియు, అది లేకున్న ననర్థంబు లనేకంబులు సంప్రాప్తంబు లగుననియు, వంగసం బంతరించు ననియుఁ దెల్పి, బాధకంబు

లేమైన నుండిన నుండుఁ గాక. పురుషునకు ధీరుఁడైన సర్వంబును సమర్థింపఁబడు. అని బహువిధంబుల తనవు బోధించి దామోదరుండు సంపూర్ణానందంబున నుంటఁదెలిసికొని యిట్లనియె. దీనిం గూర్చి నీశోకచింత వలదు. నీయాజ్ఞానువర్తినినై నిను సంతసింపఁజేయు నొకమోహనాంగిం దెచ్చి నీకుం గూర్చెద. అని తా నాగిన్నెల రసాయనం బుంచి యాతనిగిన్నెలో మరల మత్తుమందుంచి నీకూర్చువనితం గూర్చి యీరసాయనంబు గ్రోలుమని తానును దనదాని నానె.

అపుడు దామోదరుండు నవ్వుచు నాగిన్నె నందుకొని తలయూఁచి యిట్లనియె. ఓమిత్రమా! నే నిప్పటి నాస్థితికి సంతుష్టుఁడనై యున్న నీవూరించువనితకై సంతసపడకున్న నీయట్టి గృహస్థున కిట్టి స్వల్పప్రసంగతిలో వ్యతిరేకంబుగ నడుచుట నాయట్టివానికిఁ బాడిగాదు. కావున నీవు వాగ్దానంబుచేసిన వనితం గూర్చియే యే దీనిం గ్రోలెద. అని దాని నానితొల్లింటి వలె గాఢనిద్రం జెందె. అపుడు సార్వభౌముం డాతనిం గొనిరాఁ బరిచారకుసను నాజ్ఞ యొసంగి తనపలుకుఁ బొంకుగాకుండ నాయింటి వీధితలుపుమూసి రాజమందిరమార్గంబునం జనియె. అట్లు సార్వభౌముండు దామోదరునిఁ దనయింటికిఁ దోడ్కొని చని తొల్లి దామోదరుం డతనియింటికి నెత్తుకపోఁబడుతఱిఁ బండియుండిన గదిలో నుంచుటకు నాజ్ఞయొసంగి, తాఁగట్టు వలువ లాతనికిం గట్టించె. ఇంతియకాక దామోదరుండు మున్నుచొప్పున నిద్రించుతఱి నాతని వేచియుండిన దాసీదాసాదులును, యువతీజనంబులును, గాయకపాఠకులును, మరల వఱు వాతవచ్చి నిలిచి యథార్హగౌరవంబు లతనికి సలుప నాజ్ఞ

యొసంగి, జరిగెడువిచిత్రంబులం జూడ దామోదరునికంటె మున్నుగం దన్ను మేలుకొలుపం బుష్పదంతునకుం దెల్పి, తా నిదురించె.

పుష్పదంతుండును యథాప్రకాలంబున నాతని నిద్ర లేపె. అపుడు రాజేంద్రుండు వైళంబలేచి దామోదరుండుండు భవనంబునకుం జని యొకచో డాగియుండె. దామోదరుని తల్పంబునకుంజుట్టును బరిచారకులును, గాయకపాఠకులును, యోషిజ్జనంబులును, సవినయంబుగవచ్చి నిలిచిరి. ఇట్లు సర్వం బును యథాప్రకారంబుగ నుండె. ఔషధబలంబుతగ్గినతోడనే దామోదరుం డటునిటుమసల నారంభించె. అపు డిర్వురుపూంబోండులు వీణియలు శ్రుతిసేసి భూపాళరాగంబున మేలుకొలుపులు పాడందొడంగిరి. మెయిం బులక లంకురింపంజేయు నానిక్వాణంబు వినుటచే దామోదరున కత్యాశ్చర్యంబు వొడమె. కన్నులు విచ్చినతోడనే యాతనికిం జుట్టునున్న సారపాఠులును పరిచారకులునుం గాన్పించిరి. వారందఱుం దామున్న చూచిన వారలే యవుటంజేసియు, నాభవనంబును నట్లే యవుటం జేసియు, దామోదరునకు వాచామగోచరంబగు నాశ్చర్యంబు వొడమె.

ఆయువతులును గొంతవడికి సంగీతంబులు చాలించిరి. అపుడు దామోదరుం డన్నా! అన్నా! నాకు మరల నెట్టి గతి పట్టె. హా యని యపుడుగఱిచికొని తలపంకించి కొంతవడి చింతించి తుదకు నెట్లెత్తి విష్వక్సేనునకు వినవగునట్లుగ నిట్లనియె. ఓ యీశ్వరా! నాకిపుడు మాసంబుక్రిందట వచ్చిన చెడు కలయు, అందలి మాయారూపంబులును మరలం దటస్థంబు

లయ్యె. ఇంకొకసారి చిత్తంబును, వైద్యశాలయుఁ గనిపెట్టు కొని యున్నవి కాఁబోలు. ఓస్వామి ఆపద్రక్షకా! నను నీకటాక్ష వీక్షణంబుల నీక్షించి యీపట్ల రక్షింపందగు. నిర్దోషిని. రాత్రి నాయింటఁ గుడిచినయతిథి మిక్కిలి దుర్మార్గుండు. దాని కొకసందియంబు లేదు. నాకష్టంబులకును మాయారూపంబు లకుఁ గుదు రాతండే. ఆనీచుండు తలుపుమూసెద నని వాగ్దా నంబుసేసి యట్లు సేయఁడయ్యె. అది తఱి యని యెంచి, తొంటి దయ్యంబ మరల నన్నావహించి నేసార్వభౌముండ నైనట్లును, నాకిట్టి సొబగుగుబ్బెతలు గాన్పించునట్లును జేయుచున్నయది. అని దయ్యముం దలంచి, ఓ నను హింసించుదయ్యమా! నీమీఁద నేదియైన యొకగొప్పకొండపడి ననుఁ బొడిచేసిన నాకిట్టి యాపద లుండవుగదే!

అని యిట్లు పలికి దామోదరుండు దుస్స్వప్నఫలనివారణ మంత్రంబులం జదివి రామస్మరణంబు సేయుచుఁ గన్నులు మూసి వెఱఁగునఁ గొంత తడ వుండి కన్నులు విచ్చి నలుగెలం కులుఁ బరికించి, మరల గొంతెత్తి యోరక్షకా! దీనుండగు నను నీవానిం జేసికొని కాపాడ రమ్ము. దయ్యంబు కల్పించుభ్రమ లకు నేను లోనుగాకుండఁ జేయుట సర్వశక్తియుక్తుండగు నీకెంతపని? అని కన్నులు గట్టిగమూసికొని దయ్యంబు వదలు దనుక నే నిద్రించెద. ఇదియ నాకుం దోఁచినయుపాయంబు. అని మరలఁ బండుకొనియుండ, స్త్రీజనంబు వెలువడి యొక ప్రౌఢాంగన లేచి వచ్చి సామీప్యంబునఁ గూర్చుండి మృదు మధురవాక్యంబుల నిట్లనియె. ఓసార్వభౌమేంద్రా! మరల నిద్రిం చుట కిది తఱిగా దని మనవి యొనరించినఁ జిత్తంబునఁ గోపం

బూనవలదు. ఇది నిద్రించు సమయంబు కాదు. నక్షత్రంబు లన్నియుఁ బాంధులప్రాణంబు లపహరించి మించి చరించెడుపతి మన కేల యని చంద్రు విడనాడుభంగిఁ గ్రమంబుగ నస్తమిల్లు చున్నయవి. చంద్రుండు నా రాత్రించరుం దక్షుం జేసియు, చక్రద్వేషి యగులం జేసియు, చక్రదర్శనంబునకు హాని రాకయుం డంకి పఱచి పాతాళంబుఁ జేరఁ జనె ననఁ బశ్చిమసముద్రంబునఁ గ్రుంకె. చక్రవాకవ యొక్కఁడు ప్రేమచేఁ జక్కఁగఁ జనుదెంచి యొక్కచో నిశ్చలంబుగ నిలిచి స్తనయుగసామ్యంబు పూర్ణంబు సేయనున్నట్లు సమీపించి యలరుచున్నయవి. కమలిని నిజవిభుండు సహస్రకరంబుల నాలింగనం బొనర్ప వికాస భాసురముఖియై భృంగాపాంగావలోకనంబు ప్రసరింపంజేయుచు స్వీయసహస్రపత్రంబులు విచ్చి యాతని కరంబులువట్టిన నాకరపత్రంబులు గలిసి కరపత్రంబుల భంగి పయిం గప్పియున్న ప్రాలేయఖండంబుల సహస్రధా శకలంబులై పడఁ గోయుచున్న యవి. అహర్ముఖోచితకృత్యంబులు నిర్వర్తించు కాలం బతిక్రమించె.

అనవుడు దామోదరుండు గొంతెత్తి యో దయ్యమా! పొమ్ము పొమ్ము. నను బాధింపకుము. అని పల్కి కన్నులు విచ్చి యాపల్లవపాణిం గాంచి, ఓసీ సార్వభౌముం డని నన్నా నీవు పిలుచుచుంటివి. నన్నుఁ దదన్యునిఁగా భావింపఁదగు. అనుడు నాయింతి యిట్లనియె. లోకంబంతయు నేలుచు దుష్టశిక్షణంబును శిష్టరక్షణంబు నొనర్చు నేలికకుఁ దగియున్న యీసార్వభౌమాంకితంబున దేవరనుగాక యింక నేరినిఁ బిల్వందగు. ఈ తమపాదసేవకురా లట్టినామంబున దేవరనే పిలుచుచున్న

యుడి. తమ్ముఁ దాము మఱచినట్లుగ భ్రమింపంజేయుటకుం గాదె మాతో నిటుపల్కుచున్నారు. లేకున్న నిదియేమియో దుస్స్వప్న ఫలజనితం బని తోఁచెడిని. కన్నులు తిన్నగ విచ్చి చూచిన మీ భ్రమయంతయు నిరస్తంబగు. ఈదివ్యభవనంబును, పరిచారకులును, యువతీజనంబులును, సర్వోపకరణంబులును, దేవర సొమ్మే యని విస్పష్టంబగు. హంసతూలికాతల్పంబునఁ బవ్వళించు మే మిచ్చో శయనించియుంటిమా యని సంశయింపఁ బనిలేదు. నిన్న మాపు దేవర హఠాత్తుగ నిద్రించుటం జేసి లేపి శయ్యాభవనంబునకుం దోడ్కొని చన నొల్లక మీ రిపుడున్న చోటనే యుంచి జాగరూకులమై వేచియున్నారము. అని యనేకనివర్ణనంబులు సూపిన నాతండు తుదకు లేచికూర్చుండి వారలందఱుఁ దా మున్నెఱింగినవార లవుట నిజముగఁ జూచుచుండె. అపుడు తొంటి లలనామణి మరల నేతెంచి రాజోత్తమా! సార్వభౌమేంద్రా! కాలాతిక్రమణం బయ్యె. కావున నిఁక నిద్ర మానం దగు. ఇట్టి నాపల్కులచే నాగ్రహింపవల దని ప్రార్థించెద ననెను.

అపుడు దామోదరుండు గన్నులు నలిపికొనుచు నిట్లనియె. ఓసీ నీవు బతిమాలుచు బాధించుదానవు గదే. నేను సార్వభౌముండనుగాను, దామోదరుండను. నీవు దీనికి వ్యతిరేకంబుగ నన్ను నమ్మింపఁ దలపకుము. అనుడు నాయింతి స్వామీ దేవర 'సెలవిచ్చు దామోదరుం డెవ్వఁడో యెఱుఁగము. ఏలిక విశ్వంభరులగు విష్వక్సేనమహారాజులు. ఇదియ మాకుఁ దెలిసిన యథార్థంబు.

అనవుడు దామోదరుండు నలుదిక్కులఁ జూచి తొల్లి తా బాగుగ నెఱింగిన గదియందే యుంటఁ దెలిసికొని, యదియంతయు స్వప్నగత వృత్తాంతంబే యని నిశ్చయించి యనంతరఫలంబు తొల్లింటియట్లే యుండు ననియు భయంపడఁ దొడంగె. ఇట్లుండి కొంతవడికిఁ దొంటి దయ్యంబే మరలఁ గాన్పించి నాకిట్టి దుర్భ్రములఁ గల్పించుచున్న దని నిశ్చయించి చేతులును గన్నులు నెత్తి ఓయీశ్వరా నన్నురక్షింపు మని బల్కె. ఇట్టి దామోదరు తాపత్రయవాక్యంబులు దూరంబున నున్న విష్వక్సేనుండు విని కడుపుబ్బ నవ్వుచు భూమిపయింబడి దొర్లసాగె. దామోదరుండును మెల్లనఁ బాన్పుపై కొఱగిన నెప్పటి మత్తకాశిని యిట్లనియె. ఓసార్వభౌమేంద్రా నిద్రం జెందుట కిది తఱిగా దని మాకు విధి కావునఁ దెల్పితిమి. సర్వకార్యనిర్వాహకం బాస్థానంబున దేవర దర్శనమిచ్చుటచేఁ గాని కాదు. కావునఁ నిట్టిసమయంబుల దేవర మాకొసంగిన స్వాతంత్ర్యముచే ధైర్యం బలవంబించి మీఁదికార్యంబు నడుపుము.

అని పల్కి తా నొకచేఁబూని యింకొక నెలఁతుకకు రెండవకరంబు పట్టఁ గనుసైఁగ సేసె. ఆయిరువురు నాతని లేవ నెత్తి భవనమధ్యభాగంబునకుఁ గొంపోయిరి. అహహా చూడుఁడు, స్త్రీలసాహసంబు. దేవరసార్వభౌములే సుఁడీ. అని పల్కుచుఁ జెయివట్టి తెమల్చి తెచ్చి యింకొకతావునం గూర్చుండఁ బెట్టిరి. కావుననే స్త్రీకిం గల్గుసాహసంబు నీకు నుండుఁగాకయని విక్రమాదిత్యు మాత యతనిం దీవించె. అనంతర మచట భేరీ మృదంగంబులు మొరసె. నృత్తగీతంబులు మొఱసె.

అంత దామోదరుం డత్యంతము వెఱఁగంది, యే మీ విచిత్రంబు! నే నిజముగ సార్వభౌముండ నైతినా! యని మనంబున నూహించి యాశ్చర్యసాగరంబున మునింగి యుద్ది యో కొంత ప్రస్తావంబు సేయుచుండె గాని యపుడు మొరసెడి భేరీమృదంగాదులచే నాతండు విన రాఁడయ్యె. కొంతతడవున కాతండచ్చో నాఁడు వూఁబోఁడుల కిరువురకుఁ దనసామీప్యంబున రా సైఁగ సేసి యా యిరువురు వరాళకుంతలలు మత్తమరాళయానంబుల నాతండు విరాళిగొన సమీపించిన, నాతఁ డోతలోదరులార! నే నెవ్వండనో, మోసము లేక యథార్థంబుగఁ దెల్పుఁడనుడు సందోక లతకూన యిట్లనియె. ఓ సార్వభౌమేంద్రా! దేవర మ మిట్లు సంప్రశ్నంబు గావించుట విలాసార్థంబునకుఁ గానోపు. లేకున్న నేఁటిరాత్రి యేదియేని యద్భుతస్వప్నంబుం గనియుండ నోపుదురు. తడవు నిద్రించిన నిట్టి మనస్తాపంబులు కలుగుననియే కాఁబోలు, పెద్దలు దానిఁ గూడ దందురు. సెలవేని నిన్నటివృత్తాంతంబు కొంత దెల్పి దేవర మనస్సంశయంబు వాపెదము. అని తొలిదినంబున నాతం డాస్థానమండపంబున కేగుటయు, అచ్చో నంబుల శిక్షింప దండనాథుఁ బంచుటయు, దామోదరు జననికి వరాల నిచ్చి రా వజీరుం బంపుటయుఁ దెల్పి యాతనితో మరల నిట్లనిరి. దేవర తదనంతరం బొకటి రెండు భవనంబులకు విచ్చేసి యచ్చో భుజించి యీభవనంబునకు వచ్చి మమ్ముం గారవించి గూర్చుండ సెలవొసంగి నిద్రించువఱకు మాపాటల నాలించుచుంటిరి. మాచేతి పాలం గ్రోలి యనంతరమిట గాఢనిద్రఁజెంది తెలతెల వేగువఱకు మఱలఁ గన్నులం విప్పరైతిరి. నా పల్కులన్నియు యథార్థ మని యేలికబాట్లు,

నూడిగంపు జనులును, మిమ్ము నమ్మింపం గలరు. నన్ను నమ్మి యుంక నిద్రం జాలింపుఁడు, ఇది నిద్రఁ జాలుపఁదగు కాలంబు. అనుడు దామోదరుండు మంచిది మంచిది యని తల పంకించి యిట్లనియె. ఓయువతులార! నన్నెంతయు నమ్మింప మీరు వృథాగాయాసించు చున్నారు, కావున మీరందఱు బుద్ధిలేమివలనఁ జరించుచున్నా రనియు వెఱ్ఱులనియుఁ దలంచెద. ఇట్టి మీరు రూపవతులగుటకు మాత్రము వగచెద. మున్ను మిమ్ముం జూచి యింటికిం జని నిష్కారణంబుగ మాతల్లి నవమానించి వేసరింప వైద్యశాలకుం బంపంబడితి. అచ్చో నే వింశతిపరిమితదినంబు లుంటి. అచటి వారు బెత్తంబుతో ననుదినంబును నాశరీరశుద్ధిం గావించు చుండిరి. దానినంతయును మఱపించి దాని స్వప్నంబుగ నను నమ్మింప యత్నించుచున్నారు. లోకంబున నిట్టి మోసంబుండునా? అనుడు నా కురంగాక్షి యిట్లనియె.

ఓ సార్వభౌమేంద్రా దేవరపాదమాన. తాము వక్కాణించునదియంతయు మిథ్యయనుటకు స్వప్నంబనుటకు సందియంబు లేదు. ఏమంటిరేని నిన్నటిదినంబు దేవర పదచలనంబైనం జేసి యుండరైతిరి. ఇచటనేయుండి రాత్రియంతయును సుఖనిద్రం గడపితిరి. ఇవి నిజంబే యని మేమందఱము గలిసి గట్టిగ నొట్టుం బెట్టుకొనుచున్నారము.

అని యాచక్రవాకస్తని నమ్మించి పల్కిన పల్కులు విని రాజచక్రవర్తి నే యెవ్వఁడ ననియు, అది యథార్థంబే వచించె ననియు, తా నాభవనంబు వదలక యుండుటచే నిజ మనియు, నిశ్చ యించి మఱలఁ జంచలించుమనంబునం గుందుచు నిట్లనియె. ఓ దీన రక్షకా! నేను దామోదరుండనో లేక సార్వభౌముండగు విష్వక్సే

నుండనో, నాకుఁ దెలియకున్నది, దీనినిజంబు తెలియుటెట్లు? ఆపదుద్ధారకా! సుజ్ఞానదీపంబుచే నాయజ్ఞానతమం బడగించి యథార్థంబుఁ దెల్పుము. అని కన్నులు మూసి ధ్యానించి తను కంచుకం బూడ్చి వీఁపుననున్న దెబ్బల నాసుబ్బితలకుం జూపుచు నిట్లనియె. ఓశంఖినులారా! వీనిం జూడుఁడు. ఇప్పు డందుల నిజంబు మీకుఁ దోఁపక పోదు. ఈ దెబ్బలు స్వప్నలబ్ధంబులో లేక నిద్రంజెంద సంప్రాప్తంబులైనవియో యరయుఁడు. నాకుం జూచిన నివియన్నియు నిజములై యున్నట్లు గాన్పించు. నేమంటిరేని పుట్టిన నిప్పటికిం గలకల మనుచున్నయవి. కావున దీనిం గల యని భ్రమపడఁ జనదు. ఒక వేళ నిద్రించుతఱి నివి సంప్రాప్తంబులయ్యె ననియంటిరేని ప్రపంచంబున నింతకంటెను విచిత్రం బుండు నని యెంచం బని లేదు.

అని యిట్టి సంశయంబుననుండి దామోదరుం డచటి భృత్యులలో నొకని తనసామీప్యంబునకు రాఁబిలిచి, ఓరీ నే నిద్రం జెందియున్నానో లేక మేల్కనియున్నానో తెలియదు. కాని నాచెవితమ్మి మెల్లనఁ బంటి నొక్కు మనుడు, వాఁడును గటుక్కున నొక్కె. దానికి దామోదరుండు బొబ్బ మెకమఱచిన ట్లొకకేక వేసె. అపుడు సభయందంతట పటహాభాంకరంబులును, భేరీధణంధణధ్వానంబులును, మృదంగాదివాద్యధ్వనులతోఁ గూడిన యువతీజనపాదనూపురరవంబును చెలంగి భూనభోంతరాళంబులు నిండె. దానిచే దామోదరునకు నొడలు పెరిఁగి యొకసింహనాదంబు సేసి లేచి నిలిచి తాఁ దొడిగియున్న సార్వభౌమునికంచుకంబు చించి శిరోవేష్టనంబు ముష్టిహతి చేఁ గ్రిందికి దొర్లించి యాడుచున్న ముద్దుగుమ్మ లిద్దఱికడకుం జని

వారిహస్తయుగళంబు స్వీయకరయుగంబునం దెమల్చి పట్టి నృత్యంబు సేయుచుఁ బాటలుపాడుచుఁ బదపీన్యాసంబుతో శబ్దంబులు గొలుపుచు నిచ్ఛావిహారంబున రుక్మిణీ సత్యభామా సమేతుండగు శ్రీకృష్ణు ననుకరించుచు సంతసించియుండె. దూరంబున నున్న విష్వక్సేనుం డీదామోదరు సంబరంబుఁ జూచి నవ్వాఁపఁజాలక యుల్లెగిరిపోవునట్లుగ నవ్వి యాఁగదిలోఁ దొంటి యట్ల దాఁగియుండక తలవెలికిఁ జూపి, ఓదామోదరా! నన్ను నవ్వించి చంపఁదలంచితే అని యెల్గెత్తి పల్కె.

అట్టి సార్వభౌమునివాక్యంబులు వీతెంచుతోడనే యచ్చో నుండువారందరు వాన గురిసి వెలిసినయనంతర మున్నట్లు సందడి మాని యూరకనిలిచి చూచుచుండిరి. దామోదరుండు నట్లే యుండె. పిమ్మట నాతండు మేఘగర్జంబులంబోలు నవ్వాక్యంబు విని యది యెచ్చోనుండి వీతెంచెనో దాని నరయుదమని వెనుకకుఁ దిరిగినతోడనే సార్వభౌముండు గాన్పించె. అతండే తొంటివర్తకుం డనియు స్పష్టంబయ్యె. ఇట్లుండ భయ చింతయులేక తా జాగ్రత్త నున్నట్లును, వర్తమాన వృత్తాంత మంతయు స్వప్నదృష్టంబు కాదనియు నిశ్చయించి, దామోదరుండు మరల సార్వభౌమునకు నవ్వు పుట్టునటుల మొగము ముడిచికొని యిట్లనియె. అహాహా! నీవేనా వర్తకుండవు. నను మాతల్లి నవమానించునట్లుగ నొనరించి వైద్యశాలకుం బంచి బన్నముల నొందించినట్టి నీవు నిను నేఁ జంపుచున్నానని మొఱ లిడ నిఁక నేమని యనవచ్చు? నాఁడు నంబుల శిక్షింపఁబంచినది నీవె కాని నేఁగాను. ఇప్పటి కీబలువుం దించుకొంటి. నావిపదంబు రాశికి నాభిపదంబు నీవె యగుదువు, సందియ మేల? నీవు బాధ

కుండవు. నేబాధితుండను. అనుడు విష్వక్సేనుండు నవ్వుచు దామోదరా! నీవు యథార్థంబు సెప్పితివి. దేవునిసాక్షిగ నే నీకు ముదంబు పుట్టించి నీయాపదలఁ దొలఁగించెద. నీకోర్కులు సఫలంబు సేయు నభిలాషచే నున్నాఁడను. వగ వకు మని యాగది వెడలివచ్చి తాఁ గట్టు హేమాంబట్టువలువలును సర్వాభరణంబులును దెచ్చి దామోదరు నలంకరింపఁ దనపరి చారకాజనంబున కాజ్ఞయొసంగెను. వారును దత్క్షణంబ యట్లు కావించిరి. తోడన విష్వక్సేనుండు దామోదరుం గౌఁగిలించు కొని యోయీ! నీవు నాకు మిత్రుండవు. నీయభీష్టంబేదియో సంకోచింపక తెలుపుము. దానిం దప్పక పడసెదు. అనుడు దామోదరుం డిట్లనియె. సార్వభౌమేంద్రా! నా దొకచిన్న మనవి యున్నయది. నామనంబంతయుఁ గలఁగుండుపఱిచిన దానికి మూలం బెద్ది? ఎట్టియభిప్రాయంబుతో దేవర దీని నంతయు నొనర్చి యుంటిరి. ఈముఖ్యాంశం బెలిక దయనేసి నా కెఱిఁగించెదరేని నా మతి భ్రమణం బంతయు వాయు. ఇదియ నేఁ గోరుముఖ్యవరంబు.

అనుడు సార్వభౌముం డాతని యభిమతంబు దీర్పుటకు సమ్మతించి యిట్లనియె. దామోదరా నేను మాఱువేషంబున నీపురంబున మంచిచెడ్డల నరయఁ దఱచు సంచరించుచుండుట నీవు నెఱిఁగి యుందువు గదా! మాసంబులో బ్రథమవాస రంబు సంచారార్థంబుగ నేను నియమించుకొన్న దినంబు. ఇక కాలంబున నొక ప్రక్కను నింకొక పరి మఱి యొక దిక్కునను గ్రుమ్మరుచు నెల్లప్పుడు వారధి మార్గంబున నిలు సేరుచుండు. వను నీవు భోజనార్థంబు పిలిచిననాఁటిరేయి నేను పురసంచా

రంబు గావించుచుంటి. అప్పుడు ప్రసంగ వశంబున నంబుల శిక్షించుతలంపున నీవొక్క దినంబు పూర్ణంబుగ సార్వభౌముం డవ్వుటయే నీ ముఖ్యాభిప్రాయం బని పలికితివి. అట్టి నీతలంపు నాకు విశేషానందదాయి యయ్యెం దోఁచె. అప్పుడు భవదీయాభీష్టంబు సమకూర్చు నుపాయం బెద్ది యని యారసి, చవిచూచిన వానికిఁ గొంతతడవు గాఢ నిద్ర సంప్రాప్తంబగునట్టి మందొకటి నాకడ గలదు గాన నందొక మోతాదు నీ వెఱుఁగకుండ నీకిచ్చిన రసాయనంబునఁ గలిపి త్రాగనిచ్చితి. తోడనే నీవు గాఢ సుషుప్తిం జెందితివి. నా భటునకు నినుఁ దోడ్తే నాజ్ఞ యొసంగి, తలుపు మూయక యిలు వెడలి నామందిరంబు ప్రవేశించితిని. నీవు నా మందిరంబున నిద్ర మేల్కాంచిన పిమ్మట జరిగిన వృత్తాంత మంతయు నెఱిఁగియే యున్నావు. నీవు సభాభవనంబు వెడలి తక్కుంగల భవనంబుల నుండ నిచ్చటి యాడిగంపు చెలులలో నొక్కతె మగల నామాత్ర పాలం గలపి క్రోలనిచ్చె. అప్పుడు నీతొంటియట్ల గాఢసుషుప్తిం జెందితివి; పూర్వము నా వెంబడి సేతెంచిన భృత్యుండే నిను మరల నింటికిం గొంపోయె. వాఁడును తలుపు మూయకయు చనుదెంచె. అనంతరవృత్తాంత మంతయు నీవ నా కెఱింగించి యుంటివి. నీ కిట్టి యాపద సంభవించునని నే నెన్నండు నెఱుంగ నైతి. నిను గష్టసాగరంబునుండి దాఁటించు విధం బే నెఱుంగుదు నని తలంచెద. నేఁ జేసినయపమానం బిఁక జ్ఞప్తికిం దెచ్చుకొనక నీ యభీష్టంబు నిస్సంశయంబుగ నడుగుము. అనుచు దామోదరుం డిట్లనియె.

ఓ సార్వభౌమేంద్రా! నాకష్టంబు లెట్టివైనను నా ప్రభు లగు దేవరవా రని నెఱిఁగి యున్నా నని తలఁచినతోడనే యవి యన్నియు మఱవం బడియె. ఏలిక కిప్పుడు నాయెడఁ గరుణ గలదా యని సంశయింపం బనిలేదు. స్వకార్యంబునకు నేఁ దాప త్రయపడు స్వభావంబు గలవాఁడను గాను. వరమిచ్చెద నని దేవర యానతిచ్చితిరి. కావున నొక వరంబు వేఁడెద. నా కెల్ల ప్పుడు దేవర సాన్నిధ్యంబును, బ్రతికి యున్న వఱకు దేవర విద్యావిభవంబులఁ గొనియాడుచు నానందించు నదృష్టంబును గల్గునట్లుగఁ గరుణించుటయే నా యభీష్టవరం బిచ్చుట. అను నిట్టి దామోదరుని గుణవిశేషంబులం దెల్లంబు సేయు నీ యనంతర వృత్తాంతంబు వలన నాతనియెడల ప్రీతుఁడై సార్వభౌముం డా తనిం జూచి, దామోదరా! నీ కోర్కెచే నే నెంతయు ముదితుఁడనైతి. నా సమ్ముఖమునకు నిరాతంకంబుగ సర్వకాల సర్వావస్థల నీవు వచ్చుచుఁ బోవుచుండ నాజ్ఞ యొసంగితి. అని తన రాజమంది రంబున నొక లోఁగిలి యాతనికి వాసంబున కాక్షణంబ దయ సేసె. మాసవేతనార్థంబుగ నతని రాచబచ్చు కడకుఁ బంపు నిష్టంబు లేదయ్యెను, సభయునపుడు ధనంబునకుఁ దిన్నగఁ దన సమీపంబునకే వచ్చి యడుగు మనియు నాజ్ఞయొసంగె. దానికి దామోదరుండు విస్మయవినమితగాత్రుండై తన సంతుష్టిం జూపుచు నూరకుండె. సార్వభౌముండును సనిగల దని సభాభ వనంబునకు విచ్చేసె.

అంత దామోదరుం డింటికిం జని జననిం గాంచి తనయదృష్ట మంతయుఁ జెప్పి వెనుకటివృత్తాంతంబు కలగాక యథార్థంబే యయ్యె నని యంతఁ దా సార్వభౌముండై సర్వాధికారంబు సేసి

నంబుల శిక్షించి ధనంబు పంచుట నిజంబే యనియుం దెల్పె. ఈ వృత్తాంతమంతయు సార్వభౌమునివలననే స్థిరపఱుపఁబడెం గావున నా పెకు సంశయ రహితంబయ్యె. అంత దామోదరచమత్కారవార్తావిశేషంబులు వికుంఠసుతపురంబులో సర్వదిక్కుల వ్యాపించె. సమీపదూరదేశంబులలోఁ గూడఁ ద్వరలోఁ బ్రచురింపబడియె.

అనంతర మా నూతనమిత్రుండగు దామోదరుండు సార్వభౌముని సాన్నిధ్యంబున నెల్లపుడు వర్తించుచుండె. ఈతని సుస్వభావంబు నానందదాయి యగు వాగ్వ్యాపారంబును, సార్వభౌమునకు నితని మిగుల నిష్టునిగాఁ జేసె. దానిచే నాతం డీతని నిమిషంబైన వదలక మాటలాడుచుండు. కావున సార్వభౌముం డితనిఁ దలఁచుగఁ దనపట్టమహిషియగు పద్మాలయ కడకుం గొంపోవుచుండు. ఈతండు సార్వభౌమునితో నగరి కరుదెంచునవసరంబున నచ్చో నుండు రాజభార్యచెలి యగు రాధిక యను నొకయిందువదన సుందరత్వంబున కెంతయు నందించి దానిం బలుమఱు గ్రేగంటఁ జూచుచు నుండు. దాని నంతయుఁ గనిపట్టి యాపట్టమహిషి సార్వభౌమున కవ్వార్త యెఱింగించు నిష్టంబున నొకానొకదినంబున నాతనితో నిట్లనియె. ఓప్రాణనాథా! యొకవిచిత్రంబు విన్నవించెద దీనిం దేవర యూహఁ కూహించియున్నట్లు గానరాదు. మీతో నిటవచ్చు దామోదరుండు మనరాధిక యంగసౌష్ఠవంబునకుం బొంగి యనంగ సాయకదళితాంతరంగుండై యపాంగావలోకనంబున దానినే తప్పక చూచుచునుండు. రాధికయుఁ దత్పాతివ్రత్యంబునఁ దలవాంచి యాతని రతిపతిగా భావించి మందహాసంబుతోఁ దనడెందంబు

గుట్టు నూపుచుఁ గడకంటు నాదంటనే చూచుచుండు. దీనింబట్టి చూడ వీరలకుఁ బరస్పరానురాగం బున్నట్లు స్పష్టమగుచున్నది. దేవరకు సమ్మతంబేని వీరికి దాంపత్యంబు కల్గు నట్లొనరింతము. అనుడు సార్వభౌముఁడు సంతసంబున నిట్లనియె. ప్రాణనాయకీ నే నింతకుమున్నె యోచింప వలసినసంగతిని నా కిపు డీవు తెలిపితివి. దామోదరునకుఁ బ్రీణనంబుపై నెట్టి యభిరుచియున్నదో దాని నీవఱకే నే నెఱుంగుదు. అతని కనురాగంబు పుట్టించు జాయను నే నీయ నీవఱకే వాగ్దానంబు సేసియుంటి. నీవిపుడు దీనిఁ దెల్పి మిగుల సంతసంబు గల్పించితివి. దీని నే నెట్లుమఱచితినో యెఱుంగ. దామోదరుండు స్వాభిప్రాయానుసారంబుగ నీసుందరాంగిం గోరుటంజేసి మఱియు మేలయ్యె. రాధికయు ససముత్సాహయేని వారిపరిణయంబున కింకఁ దడవుసేయ నేల? వారిరువురు నిచ్చటనేయున్నవారు కావున వారి యభిప్రాయం బంతయు నారయుద మని దామోదర రాధికలం జూచిరి.

అపుడు దామోదరుండు తనయెడఁ గరుణాళులై యున్న విష్వక్సేనపద్మాలయల యడుగుఁదమ్ముల కెఱఁగి లేచి నిలిచి యిట్లనియె. ఓసార్వభౌమేంద్రా! నాకు రాధిక ధర్మపత్నియవుట కంటె నదృష్టం బింకను గలదే. ఈయన్నులమిన్న నాధైర్యసారం బంతయుఁ జూపులన యపహరించె. ఇపు డీపర్వేందుముఖిం బరిణయంబైనం దన్మానసచోరుండనై యున్ననాకుం గొంత ధైర్యం బలవడు. అని యచ్చోఁ గనకసాలభంజికంబలె నిలిచి యున్న యాకలకంఠకంఠి యగు రాధికం జూచి కరకిసలయంబులు మెఱయుచున్నవి గావున నిది లతికూన గానోపు ననియు, లత కూనకు వళిత్రితయవీచిక లెక్కడివి? కావున నిది సరసియనియు,

సరసికి సమ్మోహనసామర్థ్యముంట యబ్బాణంబు గావున నిది పంచసాయకుని సాయకంబని గను, తలపోయుచుండె. అంత నా రాధికయుఁ బద్మాలయవలన సంబోధితయై వచనముద్రం బూని, దరహాసకుసుమవికసితముఖసరసిజాతయై తలవాంచి తనకు దామోదరుండే పతిగాఁ గలుగు నని యనుమానరహితంబుగ మారరూపతులఁ వేఁడునట్లు సమానశోభాతిశయంబు మెఱయఁ దనరియుండ యవి యనుమతంబును రాజ్ఞియుభయసమ్మతంబును దనకు సమ్మతంబె యని సూచించుచు నిలిచియుండె.

అప్పుడు నా రాజేశ్వరుఁడు వివాహంబు సేయ నిశ్చయించి చంద్రతారాబలసమన్వితంబగు నొకవివాహముహూర్తంబు విచారించి పట్టణాలంకరింపఁ బరిచారకుల నియమించి, పరిణయసన్నాహంబును జేయించుచుండిరి. అంతఁ బరిచారకులు చనుదెంచి పుర మలంకరించి, పెండ్లియిల్లు మృగమదంబున నలికించి, ముత్తియములఁ ముగ్గు లుంచి, గోడలఁ జిత్తరువులు వ్రాయించి, పచ్చలతోరణంబులు గిలించి, పందిళ్ళః గదళికాస్తంభంబులు నాటించి, అంగణముల మేలుకట్లమరించి, అగురుఘనసార సౌరభంబుల గృహంబులయుఁ బరిమళింపన ట్లొనరించిరి. వివాహదినంబున రాధికాదామోదరులను వృద్ధవిప్రాంగనలు గొంపోయి మంగళస్నానంబులు సేయించి, పట్టుమడుఁగులు గట్టనిచ్చి, రత్నభూషణభూషితాంగులం జేసి, చందనం బలంది, కస్తూరి తిలకంబులుదీర్చి, కన్నుల కజ్జలంబుంచిరి. అనంతరము రాధికం గొనిచని యాముత్తైదువలు గౌరీపూజకుం గూర్చుండఁ బెట్టిరి. అప్పుడు ముదుసలులగు భూసురులు సుముహూర్తంబు సమీపించె నని సార్వభౌమున కెఱింగించిన నా రాజేంద్రుండు

స్నాతనిపట్టమహిషియు సుస్నాతులై యేతెంచి పెండ్లిమండపంబునం గూర్చుండి మంగళఘోషంబులు చెలంగ దామోదరునకు మధుపర్కం బొసంగి రాధికం దెచ్చి పాణిగ్రహణంబు సేయించిరి. పిమ్మట మణిభూషణంబులు నగ్రహారంబులు నుపహారంబుగ నిచ్చి దాసీదాసాదుల నరణం బిచ్చిరి. అప్పుడు భూసురోత్తము లా వధూవరులచేతికిఁ గంకణంబులు గట్టి లగ్నాష్టకంబులు పఠించిరి. విప్రాంగనలు గౌరీకల్యాణంబులు పాడిరి. అప్పుడు దామోదరుం డాగమోక్తంబుగ విధ్యుక్తకాలంబున భూసురాశీర్వాదంబులు చెలంగ రాధికకంఠంబున మంగళసూత్రంబు గీలించె. అనంతర మాయంగనామణిశిరంబున నారసికుండు, నాతని యౌదల నా యువతియుఁ దలఁబ్రాలు వోసికొనిరి. అంత నా నవోఢం దోడ్కొని చని దామోదరుం డరుంధతి నీక్షించె. వివాహ మహోత్సవం బయిదుదినంబులు జరిపి, అనంతర మింకొకశుభ దినంబున నాదంపతులకుఁ బునస్సంధానముహూర్తం బాలోచించి, స్వారభౌముం డొకకేళీధామం బలంకరింప నూడిగంపుయువతులం బంచె. తదనంతరం బాయిరువురఁ దోడ్కొని చని సుఖంబుగ నుండ నాజ్ఞయొసంగె. వారు నచ్చోఁ గతిపయ దాసీజనపరివృతులై యుండి యపరిమితసౌఖ్యాంబురాశి నోలలాడుచు, దర్పకుదర్పం బడఁగించిన చండీకాశంకరులభంగి కృతార్థమన్యమానమానసులైరి. ఇట్లుండ గొన్నిమాసంబులు చనె.

అంత మురాంతకసుతసంక్షుభిత సకలవిటవిటీజన స్వాంతంబును, మధుకరకరసికరసమాకర్షిత మధుద్రవోపేత లతాంతంబులును, నితాంతరత్యంత శ్రమసమాకలిత నిశాంతంబును నగు

వసంతంబు చనుదెంచె. ఆమధుమాసవాసరంబులు కాముకజన హృదయాహ్లాదకరంబులై, శుకపికనికరకోలాహల స్వనోపేతంబులై, నిఖిలవృక్షలతాగుల్మ పుష్పపల్లవశోభితంబులై యుండె. అపుడు విష్వక్సేనసార్వభౌముండు పద్మావతీయుతుండై వనవిహారార్థంబు బయలువెడలి యాయుద్యానవాటి నున్న విచిత్రంబులు తన లలనామణికిం జూపు నిచ్ఛచే నచ్చటచ్చట సంచరించి, మల్లెల మొల్లల మరువంబుల కురువకంబుల తాలమ్ముల హింతాలమ్ముల చందనభూజంబుల పిచుమందవృక్షంబులం జూపుచుం బూందోటకుం దోడ్కొని చని యిట్లనియె. ఓరమణీశిరోమణీ! స్తన నాసికా నాభీ రదనా ధరంబులతో సరియైయున్న పుష్పమంజరీ చాంపేయ పున్నాగ కుంద బంధుజీవంబులు నీ విచ్చో నుండుటం జేసి తమతమ క్షణవిలాసంబులుం జూపుచుం గొమ్మా మముం గైకొమ్మా, అని ప్రార్థించుచున్నయవి. వీనిం గైకొమ్ము రమ్మని యచోటికిం జని తా మిరువురుం గలసి పుష్పాపచయం బొనరించి నలుగెలంకుల వర్తించి, యావనంబు సౌభాగ్యంబు సార్వభౌముండు సతికిం జూపి యిట్లనియె. ఓతలోదరీ! యీవనలక్ష్మిం జూచితె. ఇది లతికాభుజయు, రోలంబశిరోజయు, పల్లవపాణియు, మొల్లసుగంధియు, మంజరీకుచభరయు, మంజులప్రసవాభరణయు, మందమారుతనిశ్వాసయు, మరందఘర్మవారికణయునై మాధవగమనంబుం గోరుచు, కలకంఠ కంఠనాదంబునం బాడుచుం బొదరిండ్లనముల్లాసంబున నున్నయది. ఇచ్చో నీలతకూన పున్నాగభూజపరీరంభ మాచరించి, పున్నాగపరీరంభణంబున నలరు లతకూనయుంబలె నలరులతో నున్నది చూడుము. పల్లవాళి నలరింప

నీకొప్పు పుష్పగుచ్ఛంబుల గేలిసేయుచున్నది, ఈవిచిత్రంబు గంటె అని నిజజాయకు నాయూవనవిశేషంబులఁజూపుచు నొక సరోవరంబు దఱియం జేరి దానిశోభాతిశయంబుఁ జూచి యిట్లనియె. ఓసరోజముఖి! యీకాసారంబు మహిమ నేమని వర్ణింపవచ్చు? పులినశ్రోణియు, చక్రవాకస్తనియు బిసబాహయు, కూర్మప్రపదయు, మీనాక్షియు, పద్మముఖియునై యున్న యీసరసి తనుపరిష్వంగులైన జనులకు మనోజాత సంతాపంబు నివారించుచున్నది చూడుము. దీనం గొంతదడవు క్రీడింతము; రమ్మురమ్మని మణిభూషణంబు లూడ్చి సార్వభౌముండు పద్మాలయకరకిసలయంబులు పట్టి యాపద్మాలయము లోనికిం జని సరిగంగలాడి యిట్లనియె; ఓమరాళగమనా! నీభుజంబులు బిసంబులని యోచించి రాయంచ వేచనుదెంచి ఘనసామ్యంబగు నీధమ్మిల్లంబు చూచి వెఱచిపఱచుచో స్వాభిమతం బలవడకుండుటయే కాక తుది నీయానంబునకు నోడె. కాకున్నఁ బక్షి, యది నిను గెలువనేర్చునే? తలక్రిందైన వైవర్ణ్యంబు నందని నీముఖముతోఁ బద్మంబు సరిగాఁ దలంచి తలక్రిందై యోడి, నయనసామ్యంబునకుం బోయిన నల్లేరైయైన భయమంది చేతులం బట్టి బతిమాలుచుఁ దుది నీపదంబులంబడి కావుము కావు మన్నట్లు, నీవు నీటికడ మొగముంచి చూచుచో నీదుచో నెంతయు సంచలించుచున్నయది కంటే. అని పల్కుచుఁ దీరంబుసేరి యార్ద్రచేలయైయున్న నాయమృత సాగరవీచి యంగలతంజూచి మని సుభ్రాంగి యతం డిట్లనియె. ఓద్విజరాజముఖి! నాయట్టి సద్విజునకు ద్విజాత రూప పూర్ణ కలశదానం బిట్టితీరంబున నిచ్చినవారికి ననంతసౌఖ్యంబు చేకు

ఉట కేమియబ్బురంబు? అని మేలంబులాడుచు నారాజశేఖరుం డా బాలికామణియుం దాను నొక్కరహస్యప్రదేశంబునకుం జని చలువమడుంగులు గట్టుకొని భూషణంబులు దాల్చి గృహంబున కేతెంచి మించినసుఖ మనుభవించుచు ననేకదినంబు లుండెను.

ఇట దామోదరుండును రాధికయు యథేచ్ఛావిహారం బున నుండి యంగడినుండు నొకవర్తకునికడ వెచ్చముంచి క్రిందుమీఁదెఱుంగక సుభోజనంబులు సేయుచు, వీణియలు వాయించుచు, సంగీతంబులు పాడుచుఁ దత్తదగ్గంబు విశేషం బుగ బరాతంబు లిచ్చుచునుండిరి. అంత సంవత్సరాంతంబున వర్తకుం డేతెంచి తనయిష్టానుసారంబుగ వ్రాసిన కవిలెం జూపి రొక్కంబడిగె. దానిమొత్తంబు చూచి డగ్గుత్తికతో దామోదరుండు మాటాడలేక కొంతవడి చింతించి దాని నిజ మారయఁజాలక కడచినదానికి వగచుట గతజలసేతుబంధన మని యెంచి తమ వస్తువాహనంబుల నొకచోఁ దాకట్టుపెట్టి ధనముం దయుఁ గూర్చి, విచారచేష్టలు ముఖంబునఁ దోఁపనీక వర్తకుం బంచిన నాతండును సంతసించుచు నింటికిం జనియె. అపుడు దామోదరరాధికలు తమ రొక్కంబంతయుఁ బరిణయంబైన యొక్కవత్సరంబులోనన చక్కం బడుటకు వెక్కసంబగు దుఃఖం బందిచిత్రరూపంబులు ధరించి కూర్చుండి యుండిరి. అహాహా! బచ్చులనమ్మి వెచ్చముఁ దెచ్చువారలకు వచ్చు నాపద లిట్టివేకదా! ఎప్పటిరూక లప్పుడే యిచ్చి వలయు సరకులు తెచ్చుకొని పొచ్చెము లేక జీవించువాఁడే ధన్యుండు.

సార్వభౌముండు తనకు వలయునపుడు ధనమిచ్చెదనని చేసినవాగ్దానంబు దామోదరునకుఁ దెలిసియున్నను నాతండు తన కిచ్చిన ధనమంతయు నంతయల్పకాలంబుననే దుర్వ్యయంబుసేసి మరల సొమ్ము నిమ్మని నోరుదెఱచి యడుగుటకు లజ్జించెఁ గావునఁ దనగుట్టు బయలఁబెట్టుటకు నిష్టపడఁడయ్యె. తనతొల్లింటిమాన్యంబు తల్లియధీనంబు సేసియుండెఁ గావున నాపెకడకుం జని ధనం బడిగిన మరలఁ దాను దండ్రియనంతరంబునఁ జేసినట్లే దుర్వ్యయంబు సేయుచుండె నని యూహింపఁగల దని యెంచి భయముపడి యచ్చోఁబోవ సమ్మతింపఁడయ్యె. రాధికయుఁ దనకు వివాహసమయంబునఁ బద్మాలయ యిచ్చిన బహుమానంబు లసంఖ్యాతంబులై తాఁ గోరఁదగుదానికంటె నధికంబులని తెలిసియున్నది గావున నాదేవిని మరల దేహి యని యడుగ సంశయించి యూరకుండె.

ఇట్లుండి కొంతవడికి దామోదరుండు భార్యం జూచి యిట్లనియె. ఓ కురంగాక్షీ! నీసంతోషరహితవ్యాపారంబుఁ బట్టి చూడ నీవుం గర్తవ్యంబు దోఁచక విచారించుచున్నట్లు గాన్పించు. నీవేమియోచించెదో గాని, నాకుంజూడ మనవ్యయంబున నిసుమంతయుఁ దగ్గింపఁగూడదని నాయభిప్రాయంబు. ఇపుడాలోచించునది యింక నెద్ది యంటేని దెల్పెద వినుము. సార్వభౌమునింగాని పద్మావతింగాని ధన మిమ్మని పీడింపకయే దాని చేకూర్చునుపాయం బారయవలయు. దీని నొకవిధంబున నే నాలోచించితి. దానినిర్విఘ్నపరిసమాప్తికి మన మిర్వుర మొకరి కొకరు సహాయం బొనరింపవలయు.

అను దామోదరువాక్యంబులు రాధిక కధిక సంతోష కారులై కొంత యాసక్తోల్పె. కావున నది దామోదరున కిట్లనియె. ఓప్రాణేశ్వరా! యేదేని యుపాయంబునకే నీవతో నేను నాలోచించుచుంటిఁ గాని నాకీవఱకేమియుఁ దోఁపదయ్యె. మన మొకరికొక రెట్లు సహాయంబు సేయవలయు? నీ నుడువునది యంతయు నాకు సంతోషకారి యవుటకు సంశయంబు లేదు. నీవొకయుపాయం బారసి నాసహాయంబు గోరుచో నాశక్తివంచనలేక సహాయం బొనర్చుట కేమి యబ్బురంబు!

అనుడు దామోదరుం డత్యంతానందంబున నిట్లనియె. ఓముద్దుగుమ్మా! యీ మనకిర్వురకు లభించు వ్యాపారంబున నీ వన్నమాట తప్పు వని గట్టిగ నమ్ముదు. మన కిపుడున్న సొమ్ము కళ్కుఱితిచే నొకయంత్రంబు పన్నుచున్నాఁడను. దానిచేఁ దప్పక సార్వభౌముండును, పద్మాలయయు మిగుల సంతసింతురు. అది యెద్దియంటేని మన మిద్దఱముఁ జచ్చుటయే అనుడు రాధిక కోపంబున వైశంబ యిట్లనియె. ఇదిగో వినుము. నేఁ జావనే తెంచుదానఁ గాను. నీ కంతకోరిక యున్న నీవే చావుము. నాకింకను బ్రతుకు భరంబు కాలేదు. చావన్న నీకు సంతసమైనఁ గాకున్న నాకు మాత్ర మిష్టము లేదు. ఇంకొకయుపాయం బూహించుట నీచేఁ గాకున్న నీయోచించినదాని నీవొనరింపుము. నా కిందుభాగంబు వలదు. అని తనపాతివ్రత్య గరిమం బాతనికిం దెల్లంబుగాఁబల్కిన, నాతఁడును గినుకయుంతైనలేక నవ్వుచు నిట్లనియె. ఏమే వేగిరించెదు. నా యభిప్రాయ మంతయుఁ దేటపఱుప నెడ మింతయైన నీయవు. ఇంచుక శాంతి వహించి నను సంపూర్ణంబుగ వినుము. అనంతర మా

చాపునకు నీవ యుద్యోగింతువు. నే నెట్టిచావంటివో దాని నీవు తిన్నఁగ విని యోచింపవైతివి. అనుడు రాధిక యిట్లనియె, తెలిసె తెలిసె, మాయచావని నీయభిప్రాయంబు గానోపు. అట్లైన నీ యిష్టానుసారముగ నాచేత నగు సహాయంబు నేయు టకు సిద్ధంబై యుందు. అటు గాక నే ముందనుకొనియున్న చావుమాత్రము నాకు సమ్మతంబుగాదు. అని యిట్లు తపపతిప యింగల ప్రేమాతిశయం బంతయు బయలుపడ నుడివె. హా! చూచితిరే యాబిత్తరి క్రొత్తడితనంబు! ఇట్టివా రుండుటచే తనే కాఁబోలు 'యథాశక్తిసహాగమనం' బను లోకోక్తి పుట్టె.

అనంతరము దామోదరుం డిట్లనియె. ఓచంచలాక్షీ! నేఁ బన్నిన మాయోపాయంబు వినిపింతు నెమ్మదినుండి వినుము. తొలుత నేఁ జచ్చినట్లుగ నటించెద. నను నాగదిలో దక్షిణ శిరస్సుచేసి పవ్వళింపంజేసి పైనొక పటంబు గప్పి రోదనము సేయుచు గాజులు చిట్లించి క్రొమ్ముడి విచ్చి ఱొమ్ము మోఁదు కొనుచు రాజ్ఞికడకుం జని యామె యడుగుల కెఱఁగుము. ఏమని యడిగిన నామెతో నిట్టూర్పులు నిగిడించుచు డగ్గుత్తిక తోఁప వృత్తాంత మంతయు వినిపింపుము. తోడనే నీకష్టంబు సూచి యామె యంతి సదయురాలై నా యుత్తరక్రియలకుఁ గొమ్మని విశేషధన మిచ్చును. దానింగొని యింటికి వైళంబ రమ్ము. అనంతరము నేనును సార్వభౌముపాలికి నీవలెఁ జని నీకు మర ణంబు సంప్రాప్తంబయ్యె నని వినిపింతు. దానివిని పద్మావతి నీకిచ్చినట్లే నా కాతండును విశేషధనం బొసంగు. పిమ్మట వృత్తాంతంబు చూచికొనుదము.

అనుడు రాధికకును దామోదరు చమత్కారకార్యంబు గొనసాగింప నుత్సాహంబు గల్గిన రమ్ము రమ్ము కాలయాప నమ్మతోఁ గార్యక్షేమమి యని పలిం దొడ్డొకనిఁ యాతని బవ్వా లించునట్లుగఁ జేసి మఱుఁ గపుర్చి, తదాజ్ఞానుసారంబుగ రోదనంబు నేయుచు రాజ్ఞికడకుం జని యచ్చో విశేషంబుగఁ గల్ల యేడ్పు లేడ్చుచు నెంతయు దుఃఖం బభినయించుచు నుండె.

పద్మావతి రాధికదుఃఖంబు నూచి రాపడి కొంతవడికిఁ దెలిసి వృత్తాంత మారయ నీ విట్లుండుటకుఁ గారణం బేమి యని యడిగిన రాధిక యేమియుం బల్కక నిట్టూర్పు నిగిడించుచుఁ జొక్కి ధరణిపై వ్రాలి యెలుంగు రాల్పడం దల్లీ నాదురవస్థ యేమని తెల్పుదు! దామోదరుండు మనల దిగనాడి దివికిం జనియె. అని పల్కి మఱియు నాక్రందనంబు సేయుచు నామె పదంబులు గట్టిగఁ బట్టికొనియుండె.

ఆమాట విని మనంబు వ్రయ్యలుగాఁ బద్మాలయ, అయ్యయో, దామోదరుఁడా! అని మిగుల వగఁగుందె. అనంతరము తనసకియలం జూచి దామోదరుం డింతలో భంగ పెట్టునని యెన్నండును గలలోనైన నెఱుంగము. పాపపువిధి వాని నల్పాయుష్కునిగఁ జేసి దీని యసువులు వోసుకొనియె. ఈయిరువురకు ననుకూలదాంపత్యంబు కుదిరెననియు, సుఖులై కొంతకాల ముందు రనియు, నమ్మి యుంటిమి గదే! అది యెంతయుఁ గలలోని వార్తయయ్యె. అని యనేకవిధంబుల విచారించుచుఁ గన్నీరువెట్టిన నామె పచారికలందఱు దామోదరు సరసాలాపంబులును సన్మార్గవర్తనంబులు నుగ్గడించి దుఃఖింప సాగిరి. అంత నాపట్టపుదేవి యొక చెలికత్తెం బిలిచి మనబచ్చు

కడకేగి వేయివరాలుతెచ్చి రాధికకిచ్చి యుత్తర క్రియలు యథావిధిగ జరిపింపుమని తెల్పు మనుడు నది వైళంబచని రూకలం దెచ్చి రాధికకిచ్చె. అంత రాధికయును రాజ్ఞిపాదం బులకు మ్రొక్కి పోయివచ్చెదనని యనుజ్ఞ గొని యింటికింజని కన్నులుదుడిచికొని దామోదరుం బిలుచుచు నిజవిజయసూచక ముఖవికాసంబుతో సమీపించి లెమ్ము లెమ్మని స్వవృత్తాంతం బంతయు నెఱింగించి యాతని సముత్సాహిం జేసిన నాతండును ధైర్యంబు వినుమడింప నిదె పోయివచ్చెదం బవ్వాళింపుమని యాపైపై నుత్తరీయంబుగప్పి తలుపుమూసి రోదనంబుసేయుచు సార్వభౌముం డున్న సభాభవనంబుకడ కేగి అమ్మొ మోదికొనుచు మొగంబున నుత్తరీయం బొత్తి దుఃఖం బభినయిం చుచు నుండె.

దామోదరు నెల్లప్పుడు హాసన్ముఖునింగాఁ జూచు సార్వ భౌముం డాదినంబున నతని విచారగ్రస్తుండై యుండం గని కారణంబారయ నేమి దామోదరా యనుడు దేవర నాకు వివాహంబుచేసిన రాధిక రాధిక యని నిట్టూర్పు నిగిడించుచుఁ గన్నులనీరు గ్రుక్కుచు నూరకుండె. సార్వభౌముండును దామోదరునింజూచి యీతండు భార్యావియోగంబు దెలుప నేతెంచె నని యెంచి వ్రాయుచున్న తనచేతి కలము క్రింద నునిచి యయ్యయో, యెట్టియాపద సంభవించె నని తడవు చింతించి యాతని నోదార్చి యుత్తరక్రియలకు వేయివరాల నిప్పించి యింటికిఁ జనుమని యాజ్ఞయొసంగె. దామోదరుండును సంతసంబున నిలుసేరె. ఈతం డిలుదరికి వచ్చు చప్పుడు విని రాధిక లేచి యెదురుగఁ జని కవుంగిలించుకొని, కాయా పండా

యనియడిగిన పండే పండే యని యిట్లనియె. ఓసీ నీవు నాకుం దగు భార్యవు. నే నీకుఁ దగిన భర్తను. దీనికి సందియంబు లేదు. విను మని తనవృత్తాంతంబంతయుఁ దెల్పి, మఱియు మఱియు నాలింగన మొనరింపఁ దొడంగె. తమజిత్తులు ప్రభునకుం దెలిసిన ప్రమాదం బగునను భయంబు మాత్రము మనంబున నుంచుటంజేసి దామోదరుండు జాగరూకుండై, భార్యా యుతుండై, దానికిఁ బ్రతిఘాతం బూహించుచుండె. అనంతర మొకవిధంబుగ నిశ్చయంబు కుదిరిన, నాతం డిట్లనియె. ఓసి మన మహారాజదంపతుల నద్భుతంబులు గల్పించి యెంతగ భ్రమింపఁ జేయుదు మంతగ వారు సంతసించి తమమనోత్సాహమును ద్యాగాతిశయపూర్వకంబుగఁ జూపుదురు. కావున మన మింతటితోఁ దనియక యీచమత్కారం బింకను వృద్ధినొందింప యత్నింపవలయు. అని యాయిరువురును యోచించుకొని ధైర్యం బవలంబించి యుండిరి.

ఇట సార్వభౌముండును దామోదరుం డరిగిన తోడనే కొలువుచాలించి రాధికమరణంబునకై వగచెడి పద్మావతి నూరార్ప నంతిపురికిం జనియె. అచ్చోఁ జెక్కుటం జెయ్యి జేర్చి బాష్పవారిపూరితనయనయై విచారించుచున్న పద్మావతిం జూచి యాతం డిట్లనియె. ఓ సరోరుహాననా! నీకష్టసుఖంబులు నాయవియే యైయుండ నీకు వేఱ నేఁ జెప్ప నవసరంబు లేదు. మనకుఁ బదార్థంబు లనిత్యంబులని తెలిసినతోడనే, వాని నాశంబునకు వగవం బనియుండదు. ప్రపంచంబున నగపడునది యంతయు నశించెడిదే కదా! పుట్టుటగిట్టుట కొఱకే, యను సుమతివాక్యంబులు వినవే? రాధిక నీకెంతయుఁ గూర్చుసఖి

యగు. ఇంతియకాక నీయాజ్ఞానువర్తినియునై యుండు. అట్టిచెలి మరణంబు దుఃఖకరంబగుటకు సందియంబు లేదు. విచారించినఁ జచ్చినవారలు మరల లేచివత్తురే? కావున వృథా విచారంబువలన మనస్స్థైర్యంబుఁ జెఱచికొనక ధైర్యం బవలంబించుటే యుత్తమం గరణీయంబు.

అనుసార్వభౌముని యౌదార్య మాటలవలన నావెకు మొదలదుఃఖోపశమనంబయ్యెను, రాధికానిర్యాణంబు వినుటచే మఱియు విచారంబు పొడమఁ దొడంగె. దానిచే నా యిల్లాలు మాటాడలేక యనంతరము మనసు కుదురుపఱచికొని యిట్లనియె. ఓ సార్వభౌమేంద్రా! దేవరయానతిచ్చు నీతి వాక్యంబులన్నియు వేదకల్పంబులు. అందుకు సందియంబు లేదు ఒక్కటిమాత్రము నాకు సంశయంబు పుట్టించుచున్న యది. ఏమనిన నాసఖియగు రాధిక బ్రతికియుండ దానిమరణంబు మీరు రిట్లెఱింగింపఁ గారణం బేమి కలదో, యది నాకుఁ దోఁచక యున్నది. రాధికాధవుండును, దేవరమిత్రుండును నగు దామోదరు మరణంబునకు నే మిగుల వగచుచుంటి. మీరు హితుఁ డని పలుకుడు వాత్రచ్చువాని చావున కిసుమంతయు విచారింపకుండుట మిగుల నాశ్చర్యంబు. అతని యెడ మీకుండు నపేక్షయే యతనిచావు దాఁచి నాచెలి గతించె నని పల్కించె. అనుడు దామోదరుఁ గన్నులారఁ జూచి యాతనిచేతనే రాధికావృత్తాంతము విని యున్నాఁడు గావున సార్వభౌముండు పద్మావతి పల్కువాక్యంబులు విని పకపక నగి సమీపంబుననున్న పుష్పదంతునిం బిలిచి యిట్లనియె. ఓయీ! మట్టుమిహిమిపలుకులు వినుచున్నావుగదా. స్త్రీ లో కానెక

సమయంబున మతిలేక మాటలాడుదు రనుమాట యట నిజమయ్యె. వృత్తాంతం బంతయు నీవు నెఱుంగుదు గదా! అని పద్మావతిం జూచి యిట్లనియె. ఇంక నీవు దామోదరు మరణంబునకు వగవం బనిలేదు. అతండు సజీవుండు. నీసఖింగూర్చి మాత్రము విచారింపుము. దామోదరుం డొకనిమేషంబు క్రిందట నాకడ కేతెంచి తనభార్య గతించె నని తెల్పె. ఉత్తర క్రియలకై కొంతధన మిచ్చి యింటికిం బంపితి. మనపుష్పదంతుండు దీనిం జూచుచుండె. అనునిట్టి సార్వభౌముని వాక్యంబులు ఛలోక్తులుగ నెంచి, తన్నాతండు చిత్రంబునకై దాని నమ్మింపనున్నాం డని పద్మాలయ యాతని కిట్లనియె. ఓ సార్వభౌమేంద్రా! దేవర హాస్యస్వభావంబు గలవారై నను దాని విని యోగంబున కిది తఱి కాదు. నే నుడువునదియంతయు యథార్థంబు. నాచెలి చచ్చె ననుట కల్ల. దామోదరుండు కాలవశుం డవుట నిజంబు. దానికే నే వగచుచుంటి. మీరును విచారింపందగు. అనుడు నాపెం జులుచులుం జూచి సార్వభౌముం డిట్లనియె. ఓ సఖి! యిది హాస్యంబు గాదు. నీవు మోసపోతివి. రాధికయే కాలచోదితయై చనియె. దామోదరుం డెప్పటియట్లే యున్నాండు.

అను సార్వభౌమునిమాటలకుం గనలి పద్మావతి యిట్లనియె. స్వామీ మీ రిట్లనుటకు నాకుం గారణంబు గానరాదు. దేవరతో నింకొకపరి రాధిక బ్రతికి యున్న దనియు, దామోదరుండే లేండనియు, నే విజ్ఞాపనం బొనరించెద. ఆరాధిక యొకగడియకు మున్నిటకు వచ్చె. దానియాకారం బేమన సంశయనివారకంబై యున్నది. దానిం జూచి నేన కాదు,

ఇచ్చో నున్న స్త్రీజన బృందము నేడ్చిరి. ఉత్తరక్రియలకుఁ గొంతధనమొసంగి దానిం బంపితి, దానిపెనిమిటి మరణంబే నా కిట్టిదుఃఖంబు గల్గించుచున్నది. అనుడు సార్వభౌముం డహాహా యని నవ్వి, ఓ పద్మావతీ! నీ వీయెడ నింతమోఱకవైతి వేమి. రాధిక చచ్చుటయే నిశ్చయంబు. అనిన తోడనే యాపె కాదు కాదు దామోదరుండే చచ్చె. నన్నింకొకవిధంబున నమ్మింపఁ దలఁపకుఁడు.

అనుడు సార్వభౌముండు కోపించి లేచి దూరంబున నున్న యింకొకపీఠంబునఁ గూర్చుండి పుష్పదంతుం బిలిచి, ఓయీ! యీవృత్తాంతంబు నిజ మగుట కొక సందియంబు లేకున్నను నీ వింకొక పరి దామోదరు గృహంబుకడకుం జని యాతనిం జూచి రూఢివర్తమానంబు తెమ్మనుడు, పద్మావతి దామోదరుండే గతించె ననువర్తమానంబు తెచ్చుననియె. అపుడు సార్వభౌముం డాపెం జూచి సఖీ యటుగాకున్న నీ వేమిచ్చెదవు. నీవు గెల్చిన నా యానందోద్యానంబు నీ కిచ్చెద లేకున్న నీవిచిత్ర భవనంబు నా కిచ్చెదే. అనుడు వల్లెయని దానికి నాపె సమ్మతించె. పుష్పదంతుఁడును పని వినియె.

ఇటఁ దామోదరుం డింటికడఁ గూర్చుండి జరుగుచున్న వృత్తాంతమంతయు నూహించి జాగరూకుండై యుండె. పుష్పదంతుడు త్వరతో నేతెంచుట దామోదరుండు గవాక్ష మార్గంబునఁ జూచి యాతని రాకకుఁ గతం బూహించి యాక్షణంబ తనయాలిం బవ్వళింపఁజేసి పైనొక గుడ్డఁగప్పి తానెప్పటి యట్ల విచారించుచుఁ గూర్చుండె. అంతఁ బుష్పదంతుండు

వచ్చి తలుపుతట్టిన దామోదరుండు కన్నీరునించుచు, మొగం
బున నుత్తరీయం బొత్తుచు నేతెంచి తలుపుఁదీసి భార్యతలదరిఁ
జతికిలంబడి యుండె. అపుడు పుష్పదంతుఁడు లోనికిం జను
దెంచి దామోదరుండు సజీవుండై యుండంగని సార్వభౌముండే
గెలిచె నని లో ముదితుండై విచారం బభినయించుచు దామో
దరుకడకుం జనియె. అతం డెదురుగఁ జనుదెంచి కన్నీరు దుడు
చుచుఁ బుష్పదంతుఁ గౌఁగిలించుకొనిన నాతండో దార్చుచు,
నీశ్వరకటాక్షమిట్లున్న మనము చేయున దేమున్నది? తా నొకటి
తలఁచిన దైవ మొకటి తలఁచునన్నట్లు, నీవేదో యొకయుపా
యంబున దినంబు లీడ్చుచుండ నీమీఁద నిసుమంత యైన దేవుండు
సదయుండు గాఁడయ్యె. వగవకు మని గాధికకడకుంజని
ముసుఁగెత్తి మొగంబు సూచి మరల నెప్పటియట్ల గుడ్డఁ
గప్పి తడవువిచారించి యిట్లనియె. ఓయీ వింటివా యీవింత.
స్త్రీల కోకానోకసమయంబున జిత్తభ్రమణంబు గల్గు, అపు
డేమియు వారలకుఁ దోఁపదు. ఒరులు సెప్పినవినరు. అని రాజా
నకు, రాజ్ఞికిం జరిగిన వృత్తాంతమంతయుఁ దేటపఱచి, ఇప్పుడైన
నే నామెను నమ్మింపఁ గలనా యని సంశయంబు పుట్టుచున్నయది.
ఇట్టి దుఃఖసమయంబున నిన్నొంటిగ విడిచి పోవ మనసొప్పకున్న
యది. రాజానకు వర్తమానం బెఱిఁగించి త్వరలో మరల
నేతెంచెద. అంతదనుక నీవు వైప్రయత్నంబు సేయుకు మని
పయనమైన దామోదరుం డాతని వీదిదనుక సాగనంపి, తలుపు
బిగించి, భార్యకడ కరుదెంచి, దాని లేవనెత్తి యోరాసి యిది
యొక క్రొత్తచిత్రంబు. ఈవర్తమానంబు రాజ్ఞి వినినతోడనే
దీని నమ్మక మరల నేరి నైనం బంపు. అపుడు సిద్ధంబుగనుండి

నను బరుండఁబెట్టుము. అని యాయిద్దఱు ముచ్చటించుచు మరల గవాక్షసమీపంబునం గూర్చుండి యుండిరి.

ఇట బుష్పదంతుండు రాణివాసంబు ప్రవేశించి నవ్వుచు రాజునకుఁ గాన్పించిన నాతం డాతురంబున నేమియోయి నవ్వెదవు? ఎవ్వరు వచ్చియున్నారో, తెల్పు మనుడు, భయం బాన నంబునం దోఁప స్వామీ! రాధికరాధికయని, దామోదరుండు తొంటియట్ల దుఃఖించుచున్నాఁ డనెను. సార్వభౌముండు నవ్వుచు మంచివార్తఁ దెచ్చితివి. ఇంతకుమున్ను విచిత్రభవ నంబు పద్మాలయదియైయుండె. ఇపుడు నేనీపన్నిదంబు గెలుచుటం జేసి యది నాయదియే యయ్యె. ఇట్టిశుభవార్త దెలిపి నాకుఁ జాల మేలు సేసితివి. అక్కడ వృత్తాంత మంతయు సాకల్యం బుగ నెఱిఁగింపు మనుడు నాతండు సార్వభౌమునకు దాని నంతయు వినిపించె. అప్పుడు సార్వభౌముండు పద్మావతిం బిలిచి దీని కెపుడు వ్యతిరేకంబుగ నేమైన నుడువఁ గలవా యనుడుఁ బద్మావతి కోపాతిరేకంబునఁ బుష్పదంతువాక్యంబునకు సమ్మతింపక యీ నానేత్రంబులతోఁ జూచి యోదార్చి పంచిన రాధిక చచ్చె నని, యీమూర్ఖుం డన్నంతమాత్రంబున నే నమ్ముదునె? అనుడుఁ బుష్పదంతుండు మీయిర్వురపాదంబులఁ గొట్టి బాసనేసెద. అపుడే నుడివిన యంతయు నిజంబు. అనుడు రాజ్ఞి వానిం జూచుచుటం జూచి యోమతిహీనా నను మాయల ముంచ కుము. ఇదిగో చూడుము నీ వాశ్చర్య మంది దీని యథా ర్థంబు దెలిసికొన బ్రారంభించెద. అని తనస్త్రీజనంబును బిలిచి యుండఁ డాక మనకడ కేడ్చుచు వచ్చినవా రెవ రనుడు వారం దఱు రాధికరాధిక యనిరి. అంత బుష్పం బిలిపించి యోయీ

నీ వేరికి గడియక్రిందట రొక్కం బిచ్చి తెసుడను చనిపోయిన దామోదరుని భార్యయగు రాధికకు వాని దినవారంబులుసేయ రొక్కం బిమ్మనిన నిచ్చితినని తెల్పె. అపుడు పద్మావతి పుష్ప దంతుం జూచి యో మహాధమహృదయా! నన్నిట నెటు నమ్మించెదవు? అనుడు నాతండేమియు ననక యది తటిగాదని యోచించి యూరకుండె.

అపుడు సార్వభౌముండు భార్యం జూచి యిట్లనియె. ఓయింతీ! పుష్పదంతు గసరెదేమి? అతని కన్నులగోచరంబైన దానిం జెప్పియున్నాడు. యువతుల కొక్కొకతటి మతులుండవని యెవఁడో బుద్ధిమంతుం డెప్పుడో చెప్పెఁగాని, దాని నీవిపుడు యథార్థమువున ట్లాచరించుచున్నావు. ఇది మిగుల నచ్చెరువు. అనవుడుఁ బద్మాలయ యిట్లనియె. స్వామీ నన్ను మన్నించిన నొకవార్త దెల్పెద. నామనంబు శాంతి నారయ దేవర పుష్పదంతున కేమైన బోధించి పంపియుండ నోపుదురు. కావున నన్నుం గూడ నేరినైనఁ బంపి దీని నిజం బారయ నాజ్ఞ యొసంగుఁ డనుడు, సార్వభౌముండు దానికి సమ్మతించె.

అపుడు పద్మాలయ తనపెద్ద దాదిం బిలిచి, ఓసీ నీవు దామోదరునింటికిఁ జని యథార్థ మారసి రమ్ము. మేలివార్త యెఱింగించిన నీకు బహుమానంబు దొరకు, వేగిరింపు మనుడు, నదియు వైళంబ చనియె. ఇంతలో దామోదరుండు తన యాలిం బిలిచి దాదిరాక తెల్పి, యిదె నేఁ బవ్వళించెద, అనంతర కార్యంబు జాగరూకతతో నడుపు మనుడు నారాధికయు నాతనిపై పటంబుగప్పి తలవిరియఁబోసికొని యేడ్చుచు సమీపంబునఁ గూర్చుండె. దాది యతిత్వరితగతితో వచ్చి రాధిక

బ్రతికియుండుటఁ జూచి లో సంతసించి కన్నీరు పెట్టుచుఁ
గూర్చున్న రాధిక నూరార్చఁ దొడంగె. రాధికయు దామో
దరుం దలంచి యేడ్చుచు, హా నన్నొంటిగ డిగనాడి చనితే.
నీ కెన్నండైన నే నెదురాడితినే? ఇట్టి నాయెడ నీకుఁ గోపింప
న్యాయంబగునే. నీకు నే విరోధినైతిఁ గాఁబోలు నని వగచు
చుండె.

అపు డద్దాది యిట్లనియె. అవ్వరా, పుష్పదంతుం డెంత
దుర్మార్గుండు పట్టుమహిషితో నెట్టివృత్తాంతంబు సెప్పె. చూచితే
యని రాధిక కచ్చోఁ జరిగిన వృత్తాంతంబు సెప్పి, నీవు చచ్చితి
వనియు, దామోదరుండు సుఖంబుగ బ్రతికియుండె ననియు,
ఆఖలుండు దెల్పె. అనవుడు రాధిక యయ్యో యెట్లయిన
నాకీ దుఃఖంబే లేకుండుగదే! అని పెద్ద పెట్టున నేడ్చి భూమి
పయింబడి మూర్ఛనొందె. దానింజూచి దాది తాఁగూడ నేడువ
దొడంగె. అనంతర మాముదుసలి యువిద దామోదరుపై నున్న
యుత్తరీయం బెత్తి చూచి, హా! యెంతకష్టము సంప్రాప్తమా
యెనే యని మరలఁ గప్పి రాధికం జూచి యమ్మా, నిన్నొంటిగ
విడనాడి పో నాకుఁ గాళ్ళాడకున్నను త్వరతోఁ బోయి, మన
రాజ్ఞి మనంబు భ్రమరహితంబుగఁ జేసి రావలసియున్నది.
నేఁబోయి వచ్చెద. ధైర్యంబుతో నుండు మని చనియె.

రాధికయు దాదిం బంచి కన్నులు దుడిచికొని పెనిమిటి
కడ కేఁగి లెమ్మని తెల్పి గవాక్షముకడకుఁ దోడ్కొనివచ్చి తత్స
మీపంబునఁగూర్చుండి తాముచేసిన మోసముం దలంచుచుఁ
గర్తవ్యం బూహించుచుండె.

ఇట నా దాది వేగంబుతో నరుదెంచి రాజ్ఞికి నచ్చోటి వృత్తాంతమంతయుఁ దెల్పిన నాపె యత్యానందంబున దానిని జూచి బహుమానంబిచ్చి, యేలిక కీవార్త మఱియొక పర్యాయంబు దెల్పి మనపైనుండు దురభిప్రాయంబు దొలఁగింపుము. దేవునిభయమైన లేక కల్లలాడుచు మోఱకుఁదనంబున నున్న పుష్పదంతునకు దీనిం దెల్పి బుద్ధిచెప్పుము.

అనునపుడు యథార్థము చెప్పి తనకు సహాయం బొనర్చు నీదాయియని పుష్పదంతుం డూహించెఁ గాని, యిటుల నా దాయియే దాయయై తన పుట్టి ముంచు నని మాత్ర మెంచఁ డయ్యె. ఇంతియకాక తాఁ గన్నారం గాంచిన వృత్తాంతంబునకు రాజ్ఞి యింతగాఁ దన్ను నో నాడునదియుం దలఁపఁడయ్యె. తెంపునేసి దాయిని నాలుగుమాట లడుగఁదలంచియు నాతండు రాజ్ఞి కేమి తోఁచునో యని సాహసింపలేక, మెల్ల మెల్ల నిట్లనియె. ఓసీ! నీ కేండ్లు పెక్కుడియున్నను నాయీ కన్నులఁ జూచిన వృత్తాంతమును గల్లయని రాణితో నెంత యబద్ధ మాడితివే. అనుడు నాయింతి యిట్లనియె- ఓబూటకములమారీ! యిప్పుడే నేఁ జూచి వచ్చియుండ రాధికచచ్చెననియు, దానోదరుండే బ్రతికియుండె ననియుఁ జెప్పి మాకన్నులు కప్పం జూచెదు. అనపుడు నీవెంత మోసకత్తెవే మమ్ము బుట్టలోఁ బెట్టకుము. అనుడు నోరీ సిగ్గుమాలి ప్రభులముందట నాకన్నులారఁ జూచిన వృత్తాంతములో నే నసత్య మాడితి నంటివి అనిన ముసలీ నీవు వార్ధకంబున నుంటం జేసి నీకు మతి లేదు. కావున నీపాటి నీమాటలు చాలింపుము.

అని యిట్లు పుష్పదంతుండును దాయిమాటలకు నెడమీయక గదుముచున్నాఁడని పద్మాలయ కనలి సార్వభౌముం జూచి, ఓ సార్వభౌమేంద్రా! దేవరయెదుట నీతండు చేసిన తుచ్ఛ సంభాషణంబులకు న్యాయమందు బుద్ధినిలిపి మందలింపం దగు అని కోపంబుతోఁ బల్కి డగ్గుత్తికపడి మాటరాకున్న రోదనంబు సేయందొడంగె. సార్వభౌముండును నిశ్చేష్టితుండై యుండి యేమియుం బల్కక, తనవలెనే నివ్వెఱఁగందియున్న పద్మావతీ ప్రముఖులం జూచి పద్మావతితో నిట్లనియె. ఓ తెఱవా! నాకుం జూడ మన మందఱమును నబద్ధీకులమే యని తోఁచుచున్నయది. మనలో నొకరి నమ్మ నొకరికి నలవి గాకున్నయది. కావున మన మందఱ మచటికిం జని యథార్థ మారయుటకంటె నుపాయ మింకొకటి నాకుఁ గానరాదు. అని సార్వభౌముండు దిగ్గున లేచినఁ బద్మావతియుఁ బయనంబయ్యె. అపుడు పుష్పదంతుండు ముందుగఁ జని తలుపు తీసి యో రాజేంద్రా! దేవర యిట్లు సంకల్పించుటం జేసి నా కెంతయు ముదంబు గదురుచున్నయది. ఈదాయి వార్ధకంబుచే మతిలేక యున్న దనుమాట యేలికకైన స్పష్టంబగు. అనుడు నీవు ముదిసితివి. మాటలాడకు మని యాదాయి యుత్తరంబిచ్చె.

ఇట దామోదరుండు తనయింటికి దూరంబున నెదురుగ నున్న రాణివాసంబునుండి వెలువడి రాజదంపతు లేతెంచుటఁ జూచి, యాలిం బిలిచి మనప్రభులు మనకు దర్శనంబిచ్చి గౌరవింప నేతెంచుచున్నారు. అనుడు నాపె భయమంది ముందు గతియేమి? యని యడిగిన నాతం డిట్లనియె. ఓసీ భయపడెదేమి.

దరుం జూచి యిట్లనియె. ఓయీ మమ్ము వెనుకటివలె నవ్వించి చంప నీవెంతకాలంబునుండి దీని యోచించుచుంటివి. నే మెన్నండు నూహింపని యీవింతపని చేసి నన్నును బద్మాలయను భయమందునట్లు చేయ నెట్లు దలంచితివి! ఇట్లు చేయుటకుం గారణం బేమి. అనుడు దామోదరుం డిట్లనియె.

ఓసార్వభౌమేంద్రా, యీకథ యంతయు దేవరతో సంశయింపక విన్నవింతు వినుండు. దేవర నే నెల్లపుడు భోజనప్రియుండ నని యెఱుంగుదురు గదా! ఏలిక నాకు దయచేసిన యాలును నా కడ్డి సెప్పక నా యిష్టము నే మఱియు వృద్ధిబొందించుచుం దానును సంతసించుచుండునదే. ఇట్టివర్తనంబు గల మేమిర్వుర మెట్లుగ వ్యయంబు సేయుదుమో దేవరకు విశదమై యుండకపోదు. ఇంకం జెప్ప నేల. దేవర మాకు దయసేసిన విత్తంబులో నేటికి నొకగవ్వయైన నుంచలేదు. ఈయుదయంబు బచ్చువచ్చి కవిలెం దెచ్చి రొక్కంబడిగిన నిల్లంతయుం దుడిచిపెట్టి యాతనిధనం బిచ్చివేసితిమి. అనంతరము మా వృత్తాంతం బంతయుం దలంచి తడవు చింతించి కర్తవ్యం బాలోచించుచుంటిమి. దేవరతో నీవృత్తాంతంబు దెలుపనోడి మాకు నక్కర దీర్చునట్టియు, నేలికకు నానందదాయియౌనట్టియు యంత్రంబు పన్ని దేవర నిట రప్పించిన మము మన్నింతు రని నమ్మియున్నారము.

అనునిట్టి దామోదరు బోళాతనంబునకు సార్వభౌముండును పద్మాలయయు నెంతయు సంతసించిరి. ఆవలను మానంబుతో నున్న పద్మాలయ యీయంత్రం బంతయుం బరికించి నవ్వ

నారంభించె. ఈ విచిత్రసాహసకృత్యమునకు విశేషంబుగ నవ్వుచు సార్వభౌముండు లేచి యాదంపతులంజూచి మీ రిర్వురు నాతో రండు. మీకు నే నిచ్చెద నని వేయినూటపదాఱు లిచ్చెద ననియె. భద్రాలయయుఁ దనచెలికి నట్టి మొత్తమే యిప్పింపం గోరె. ఇట్టి సాధనముచే దామోదరరాధికలు తమప్రభువుల దయ స్థిరపఱిచికొనిరి. వారియాదార్యాతిశయంబే దంపతులను వారి జీవితకాలంబులో సంసారేతిబాధ లంటకుండం జేసి సార్వకాలిక సుఖ మనుభవించున ట్లొదవించె.

మత్తేభవిక్రీడితవృత్తము:—

గురుజా డాన్వయదుగ్ధ వార్ధివిధుఁడై క్షోణిన్ శివారాధనన్
పరమప్రీతి నొనర్చి యద్వయపరబ్రహ్మంబు దానై తగి
ద్దురుఁ డీతం డను పండితోక్తిఁ గను నా దుర్గప్రసాదార్యుఁడున్
సిరియా రత్నమసాధ్విగన్న సుతుఁడున్ శ్రీరామసన్నాముఁడన్.

తోటకవృత్తము:—

రచియించితి నీకృతిరక్షకనే
వచనంబుగ నాదగు వాక్యసుమ
ప్రచయంబున నీమృదుపాదములన్
బచరింపఁగఁ బూజలు భక్తులతోన్.

ద్వి తీ య వీ చి క

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1951.

# పద్యకావ్యములు

ప్రతి 1

అన్యవాదకోలాహలము, లఘుటీక ...
అధ్యాత్మరామాయణము, పద్యకావ్యము ...
అనిరుద్ధచరిత్రము ...
అంబరీషోపాఖ్యానము, సటీక ...

ఆంధ్రభారతము, పద్యకావ్యము:—
- ఆది సభాపర్వములు ...
- ఆరణ్యపర్వము ...
- విరాటోద్యోగపర్వములు ...
- భీష్మద్రోణపర్వములు ...
- కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ...
- శాంతిపర్వము ...
- అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు
- ఆదిపంచకము, ఒకటేసంపుటము ...
- యుద్ధపంచకము, స్త్రీపర్వము ...
- శాంతిసప్తకము ...
- ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు ...

ఆంధ్రశ్రీమద్రామాయణము—శ్రీ జనమంచి శేషాద్రిశర్మ గారిది 3 సంపుటములు ...
ఆంధ్రభాగవతము, పద్యకావ్యము, 2 సంపుటములు ...
ఉత్తరరామాయణము, చక్కనికూర్పు ...
ఉత్తరహరివంశము ...
కాశీఖండము ...
కుమారసంభవము, నన్నెచోడకృతము ...
ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారిది
చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము ...

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది | ... | 1 | 8 |
| చెన్నపురీవిలాసము | ... | 0 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 4 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | ... | 0 | 6 |
| ఆంధ్రనామసంగ్రహము, పద్యనిఘంటువు | ... | 0 | 3 |
| ,, టీకతో | ... | 0 | 10 |
| ,, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, వగైరా టీకతో | | 2 | 0 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 1 | 0 |
| కవిత్వతత్వవిచారవిమర్శనము | ... | 1 | 8 |
| కవిరాజమనోరంజనము | ... | 1 | 4 |
| కృష్ణదండకము | ... | 0 | 2 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 12 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 8 |
| డిటో గట్టుప్రభుకృతము | ... | 0 | 10 |
| గయోపాఖ్యానము, పద్యము. రామనామాత్యునిది | ... | 0 | 12 |
| డిటో ద్విపద, నాదిండ్ల గోపమంత్రి | ... | 0 | 8 |
| గద్యపద్యసంగ్రహము, జ. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది. | ... | 0 | 12 |
| ,, గొర్తి సూర్యనారాయణశాస్త్రిగారిది | ... | 1 | 0 |
| గరుడాచలము-యక్షగానము, పెద్దచ్చు | ... | 0 | 3 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహము | ... | 0 | 4 |
| చెన్నబసవపురాణము | ... | 2 | 8 |
| జైమినీభారతము | ... | 2 | 8 |
| తెలుఁగుసమస్యలు | ... | 0 | 3 |
| దసరాపద్యములు | ... | 0 | 2 |
| దశావతారచరిత్ర, పద్యకావ్యము | ... | 4 | 0 |
| ధనాభిరామము ,, | ... | 0 | 12 |
| దేశింగురాజుకథ (జంగంకథ) | ... | 0 | 8 |
| ధ్రువోపాఖ్యానము, సటీక | ... | 0 | 10 |

| | | ప్రతి 1-కి రూ. | అ |
|---|---|---|---|
| నలచరిత్ర, ద్విపద, క్యాలికో బైండు | ... | 2 | 4 |
| నిరంకుశోపాఖ్యానము | ... | 0 | 10 |
| నిర్వచనోత్తరరామాయణము | ... | అచ్చు. | |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము | ... | 0 | 8 |
| పల్నాటివీరచరిత్రము | ... | 3 | 8 |
| పంచతంత్రము, నారాయణకవిది | ... | 1 | 8 |
| డిటో వేంకటనాథ రాజకవికృతము | ... | 2 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము | ... | 1 | 12 |
| పారిజాతాపహరణము, చిన్న సైజు | ... | 1 | 0 |
| ,, సాంధ్రటీకాతాత్పర్యము | ... | 3 | 0 |
| మనుచరిత్ర, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద ముద్రితము | | 5 | 0 |
| భాస్కరరామాయణము | ... | 8 | 0 |
| రంగరాయచరిత్రము | ... | 0 | 12 |
| రాఘవపాండవీయము, సటీక | ... | 4 | 0 |
| రాజశేఖరవిలాసము | ... | 0 | 8 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 6 |
| రామరాజీయము | ... | 0 | 12 |
| రామాభ్యుదయము | ... | 2 | 0 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక | ... | 1 | 8 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద | ... | 1 | 4 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) | ... | 2 | 0 |
| బిల్హణీయము | ... | 1 | 4 |
| రుక్మిణీకల్యాణము, సటీక | ... | 0 | 10 |
| రుక్మిణీపరిణయము | ... | 0 | 10 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ముగ్గురుమూర్ఖులు | ... | 2 | 8 |
| పుణ్యశ్లోకులు | ... | 0 | 8 |
| పంచతంత్ర - హితోపదేశ కథామంజరి | ... | 1 | 12 |
| సంస్కృతనాటకకథలు 1, 2 భాగములు | ... | 2 | 0 |
| తిలకు సెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | ... | 0 | 14 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము | ... | 1 | 4 |
| డిటో రెండవభాగము | ... | 0 | 10 |
| డిటో మూఁడవభాగము | ... | 0 | 8 |
| సంగ్రహరామాయణము | ... | 1 | 8 |
| భోజునికథలు | ... | 1 | 4 |
| రాజశేఖరుఁడు—గోపాలుఁడు | ... | 0 | 12 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 12 |
| చార్‌దర్వేషుకథలు | .. | 1 | 0 |
| బేతాళునికథలు | ... | 0 | 12 |
| వైద్యులకథలు | .. | 0 | 4 |
| వీరాంగనలు | ... | 0 | 12 |
| పరమానందశిష్యులకథలు | .. | 0 | 4 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | 6 |
| అయిదుగురుదొంగలకథలు | ... | 0 | 8 |
| రేచుక్కపగటిచుక్కకథ | ... | 0 | 4 |
| సత్యసేనవిజయము | ... | 0 | 6 |
| ఋషులచరిత్ర | ... | 0 | 8 |
| పురాణగాథలు I | ... | 1 | 0 |
| ,, II | ... | 1 | 4 |
| బాజీరాయునిచరిత్ర | ... | 1 | 0 |
| రఘువంశకథ | ... | 0 | 8 |

